TPLEIOHB 70

# పునరపి జననం

(కథల సంపుటి)

7 4159/397



రచన

'శార్వరి'



సరళా పబ్లికేషన్సు,
బోస్‌రోడ్ - తెనాలి.

## ఇందులోని కథలు

# మధురోహ

రెండు రెండు నాలుగు...

నాలుగు వ్రేళ్లు రెండు జతలుగా చేరి, అతిసున్నితంగా, నాజూగ్గా, లాఘవంగా, లాస్యం చేసినయి. చీకటిలో తళ తళా, మిలమిలా మెరిసే రవల వెలుగుల్ని పొదివి పట్టుకుని, గప్‌చిప్ అన్నట్లు దాక్కున్నాయి.

ముందు వరసలో కూర్చుని, మంచి శృంగార ఘట్టాన్ని, అపూర్వంగా, ఆనందంగా అనుభవిస్తున్న అమ్మాయీ ద్వయంలో ఓ అమ్మాయి నున్నని, తెల్లని మెడపై చక్కలి గింత పెట్టినట్లయి ఇస్సో అనుకుంది. నెక్లెస్ చేతికి తగల్లేదు. నాయకీ నాయకుల శృంగార శృంగాగ్రం మీదనుండి, కుహనా నంద నందనవనంలో నుండి ఒక్కసారిగా గతుక్కున క్రిందికి జారి, తేరుకుని, ఆత్రంగా వెదుక్కుంది. జారిపోయిందేమో నని జాకెట్‌లో, పైటచాటున మరీ పరిశీలించుకుంది. అప్పటికి గాని స్ఫురించలేదు, తన మెడమీద అంతకు ముందు కలిగిన స్పర్శతాలూకు స్మృతి. మరొకప్పుడైతే అది అనుభూతి అయ్యేదే కానీ, ఫలితం ఇదీ అని అనుమానం కలిగాక, అది భయంగా మారి, సాశ్చర్యంలో, కంపనంతో వెచుదిరిగింది. చీకట్లో వెనక సీట్లోంచి ఎవరో వెళ్ళిపోవటం లీలగా గమనించింది కూడా. సీటు ఖాళీఅయి వెక్కిరించింది.

"అమ్మో! దొంగ-దొంగ" అని అరిచింది. తోడొచ్చిన సుశీల అంతకంటే గాభరాపడి—

"ఏమిటే హైమా, ఏం పోయింది?" ప్రశ్నించింది. మధుర సన్నివేశాన్ని మంటగలిపిందే ఈ గాభరా అన్న బెంగ సుశీలకు లేకపోలేదు.

"నెక్లెస్!"

"నెక్లెసా! అమ్మో!"

అప్రయత్నంగానే తన మెడ నోసారి సవరించుకున్నది సుశీల.

క్షణంలో రిజర్వుడు క్లాసంతా గగ్గోలైంది. 'దొంగ... దొంగ' ప్రతివాడు అరిచాడు. అంతా ఆ అమ్మాయిలిద్దరి చుట్టూ గుమిగూడారు. అసలు దొంగను పట్టుకోవడానికి ఎవరూ ప్రయత్నించలేదు. అసలు దొంగ ఎవరో? ఎవరికి తెలుసు? పైగా మంచి రసపట్టులో రసాభాస అయిందని విసుక్కున్న ప్రేక్షక మిత్రులు లేకపోలేదు.

లైట్లు వెలిగాయి రెండు నిమిషాల వ్యవధిలో. మంచి పట్టులో లైట్లు వెలగడంతో చాలామందికి చిరాకు పుట్టుకొచ్చింది కూడా. కుర్చీలపై నిలబడి, గుర్రాన్నెక్కిన శివిలో వింత చూస్తున్నవారు చూస్తున్నారు, పరామర్శించేవారు పరామర్శిస్తున్నారు.

"సినిమాల కొస్తూ, సింగారం ఎందుకో?" అన్నది ఒక కంఠం.

"హైమవతేనా! తిక్క కుదిరిందిలే" అన్నది మరో పూర్వ విద్యార్థి కంఠం. అదేదో భగ్నహృదయము తాలూకు చివరి మూల్గులా వినిపించింది.

"ఏమండీ, నెక్లెసా? మీదేనా?" అని పరామర్శించాడు. ఓ ప్రేక్షక యువకిశోరం, ఓ అడుగు దూరంలో ఎదురుగా నిలబడి.

అసలే గాభరాగా వుంది హైమ. క్రింది పెదవి పై పంటితో బిగించి, వొస్తున్న దుఃఖాన్ని, కోపాన్ని ఆపుకొని, అభిమానం చూపించ ప్రయత్నిస్తోంది. కళ్ళవెంట గిరగిరా నీరు తిరుగుతోంది. తల వొంచుకుని ఈ మాటలు విన్నదే గాని సమాధానం చెప్పలేదు.

"ఎవరో పోకిరీ వెధవ" అనుకుందికూడా. కానీ వెలుగు పోకి నిగనిగ మెరిసే బూట్సూ, గాబర్డీన్ పాంట్, తలవొంచుకున్నా కళ్ళకుట్టేసేలా చేసినయ్. ఒక్కసారి సాశ్చర్యంగా మొహంలోకి చూచింది.

ఎవరో? ఎన్నడూ చూచినట్లు లేదు.

"మీదేనా పోయింది" అతగాడి అపరిచిత కంఠం ఆత్రుతగా, ఆప్యాయంగా వినిపించింది.

"అవునండీ" అన్నది తలవొంచుకునే.

"పాపం! నెక్లెస్ లేకపోతే ఎంత బోసిగా వుంది మీ మెడ" అని పర్యాలోకించాడు, సౌందర్యాన్ని అన్వేషిస్తో.

ఎంత గడుగ్గాయి! అంతమందిలో అంతమాట అనగల సాహసం ఎలా వచ్చింది అనుకుంది. అయినా ఆ సాహసానికి, ఆ వర్ణనకు సిగ్గుపడి పోయింది.

"మీ నాన్నగారికి ఫోన్ చేద్దాం పద హైమా" అన్నది సుశీల ఆమెను కదుపుతూ.

ఇద్దరూ లేచి మేనేజరు గదిలోకి వెళ్ళి ఫోను చేశారు. మళ్ళీ సినిమా హాల్లోకి మాత్రం రాలేదు. బయట కారు చప్పుడు చేసుకుంటూ వెళ్ళిపోయింది. "డి. యస్. పి. గారి అమ్మాయి రా" ఓ గొంతు. అది విన్నాడు విశ్వరూపం.

"డి. యస్. పి. గారి అమ్మాయికదూ" చెవుల్లో రింగు మంటూ వుంది ఆ మాట.

"హైమా" ఆ అమ్మాయి పేరు.

గదిలో బరువుగా అడుగు పెట్టాడు విశ్వరూపం. రాత్రి పది గంటల కాలం సూచిస్తున్న గోడ గడియారం ఒక్కసారిగా స్తంభించి పోయింది. గడియారమే కాదు కాలమే స్తంభించింది విశ్వం పాలిట.

'ఇంక నేను కదలను...ఇంతకాలం నీవు చెప్పినట్లల్లా విన్నాను. ఇంక నేను పనిచేయను. నా బుర్ర వేడెక్కిపోయింది. నువ్వే నా మాట విను' అంటుంది చిన్నముల్లు పెద్దముల్లుకు అల్లంత దూరంలో ఆగిపోయి. శతధా ప్రయత్నిస్తోంది కలుసుకుందామని, మచ్చిక చేదామని ఒకటవుదామని, స్నేహంచేదామని, కానీ కాలం పదినిమిషాలు ఆగితే ఎంత బావుంటుంది. ఆ ఒక్క పదినిమిషాల వ్యవధిలో రెండూ కలుసుకుని జోడు

కట్టేవేసురి. అప్పటికంతే. కాలాన్ని క్రమబద్ధం చేయటం, పరిస్థితుల్ని అనుకూలంగా మార్చుకోవటం మానవులకు సాధ్యంకాని పనిగదా!

అదే మరొకరోజునైతే 'సక్సెస్...థండరింగ్ సక్సెస్' అనుకుని ఖుషీ చేసేవాడు విశ్వరూపం. కాని ఎందుకో ఆరోజు తలభారం అనిపిస్తోంది. ఆ అమ్మాయి మరుపుకు రావటంలేదు. "హైమ" ఎంత బావుంది. పేరులో ఏముంది. మనిషికి తగ్గపేరు కానేకాదు. మనిషి కలాకలా, మెరపుతీగలా వుంది. ఆ శరీరం తన చేయితగిలి ఎంత అపవిత్రం అయిందో. అక్కడ కందిపోయి ఉంటుంది. ఆ క్షణంలో నిజానికి తన కెలాంటి అనుభూతి కలుగ లేదు. ఏమీ జరగలేదు. అంతా మామూలుగా, సజావుగానే జరిగిపోయింది. తిరిగి అక్కడే ఇచ్చివేద్దామనిపించింది. కాని ఎలా సాధ్యం?

రోజులు గడుస్తున్నాయిగాని, ఆలోచనలు మారటం లేదు. మరీ మనస్సు కకావికలం అయిపోతుంది. ఆ అమ్మాయి మరొకసారి కనిపిస్తే బావుండును. ఎక్కడ కనిపిస్తుంది, అంత కనికరమా? పైగా పోలీస్ ఆఫీసర్ కూతురు. అది తెలిసి మరీ ఇద్దైపోయినాడు. ఆశలు నీళ్ళుకారి పోయినాయి.

వెళ్ళి కలుసుకోవాలన్నా వీల్లేని స్థితి. "ఇదిగో, మీ అమ్మాయి హైమ నెక్లెస్ - నాకు దొరికింది" అని యిస్తే, సూపరెంటెండెంటు నమ్ముతాడా! అసలే ఆయన అగ్ని హోత్రం, మహా తెలివైన ...డు. తనను అనుమానించడా? ఆ రేళ్ళుగా బ్రహ్మకు కూడా అడ్రసు దొరక్కుండా తిరుగు

తున్న తను ఈ రోజున ఒక మెరుపు వలలో చిక్కుకుని తన నిజరూపాన్ని బైటపెట్టుకోవడం వెర్రితనం.

ఈ విషయంలో పోలీసుల ఆచూకీ వ్యర్థం అవుతుందని తనకు తెలుసు. తనను అనుమానించలేరు. ఇంతవరకు జరగ లేదు. మంచి నూటులో, పెద్దమనిషిలా, లక్షాధికారిగా చలా మణి అవుతున్న తనని అనుమానించి పట్టుకునే దమ్ము ఈ పోలీసులకు లేదు. క్లబ్‌లో సర్కిల్, సబ్ ఇన్‌స్పెక్టరులు, డి. వై. యస్. పి. లు అందరూ తనకు మిత్రులే. బ్రిడ్జిఆటలో, బిలియార్డ్సులో అందరూ తన పార్ట్‌నర్సే, ఇంకెవరు అనుమా నిస్తారు? అలాంటి తను తనకుగా బైట పడితే!

రోజులు దొర్లుతున్నాయి. హైమ రూపం మరీ హృద యంలో ఏడురంగులతో హత్తుకు పోయింది. ఆమెను కలుసు కోవాలన్న ఆలోచన మరీ యెక్కువైంది. వెర్రివాణ్ణి, పిచ్చి వాణ్ణి చేస్తోంది ఆ భావన.

అవకాశం మాత్రం రావడంలేదు. హైమను ఎప్పుడైనా, ఎక్కడైనా ఒక్కసారి కనిపిస్తే బావుణ్ను. ఏ చిన్న అవకాశం వచ్చినా, ఆ అందాలరాశి నెక్లెస్ ఇచ్చివేసి, సంతృప్తిగా నిట్టూర్చాలని వుంది. ఆ అమ్మాయి అందాన్నే తాను హరిం చేడు. చాలు. కృతజ్ఞతగా ఒక్కమాట మాట్లాడితే, ఒక్క చిరునవ్వు ప్రసరిస్తే ఆజన్మాంతం కృతజ్ఞత చూపగలడు.

ఒకానొక రోజున అనుకోకుండానే ఆ అవకాశం లభిం చింది. గాంధీరోడ్డులో పరాకుగా నడుస్తుంటే చున్నీలాల్ బట్టల షాపులోంచి ఓ కోయిల కంఠం కాళ్ళకు బందాలు

వేసింది. అటు తిరిగి చూచాడు. షోకేసు అద్దాలలోంచి అగు పించింది అందాలరాశి, ఆశాసుందరి హైమ.

ఒక్కసారిగా అడుగులు తడబడ్డాయి. శరీరం కంపించి నట్లయింది. కోల్పోయిన ధైర్యాన్ని కూడదీసుకుని లోపలకు నడిచాడు. అనుకున్న అమ్మాయి బట్టలు బేరం చేస్తోంది. పక్కనే అయిదేళ్ళ పసివాడు. కుర్రాడు, అందంగా, బొద్దుగా, రబ్బరు బొమ్మలా ఉన్నాడు. అది కావాలని, ఇది కావాలని మారాం చేస్తున్నాడు.

హైమ ప్రక్కగా వెళ్లి కేసుల్లోని పట్టు రంగుల కేసి చూస్తూ నిలబడ్డాడు. పరాకులో అతన్ని చూచిన హైమ చప్పున బుజం మీద పైట లాక్కుని నిండుగా కప్పుకుంది. జ్ఞాపకాల మడ తల్లోంచి ఓ పొర ఓ పుట విప్పింది. ఎక్కడో ఎప్పుడో చూచిన జ్ఞాపకం కలిగి, అదోమాదిరిగా, ఆదోగుగా చూసింది. జ్ఞాపకం రావటం లేదు అనుకొన్నది కాని ఆలోచన సారిం చటం మాన లేదు. ఆ చూపులు బాగా జ్ఞాపకం, వాటి వాడి, వేడి......

ఆ చూపు కోసమే వేయికళ్ళతో వెదుకుతున్న విశ్వ రూపం అటే తిరిగి "అరే! మీరా" అన్నాడు ఆశ్చర్యం ధ్వనిస్తూ.

ఆమె సమాధానం చెప్పలేదు. ఆ పరిచయాన్ని స్వీక రించనూ లేదు.

"జ్ఞాపకం రావటంలేదాండీ! ఒక రోజున సినిమా హాల్లో కలుసుకున్నాం. మీ నెక్లెస్ పోగొట్టుకున్నారు!" అని

జ్ఞాపకం చేశాడు విశ్వం. అవుననన్నట్లు తలవొంచుకుంది సిగ్గు, అభిజాత్యం అడ్డురాగా.

అంతలో బట్టలకొట్టు గుమాస్తా అవతలకు వెళ్ళాడు ఏదో బేరం తగిలి. అదను ఉపయోగించి నెమ్మదిగా చెవిలో రహస్యం చెప్పాడు.

"అన్నట్లు, ఆ రోజునుంచి మీ కోసం వెదుకుతున్నాను కనిపిస్తారేమోనని. నెక్లెస్ పోయిందని అంత రసాభాస చేశారా! తీరా మీరు వెళ్ళిపోయారు. ఆట అయిపోగానే మీ సీటు క్రిందనే పడివుంది. తీసుకున్నాను, మీరు కనిపిస్తే ఇద్దామని ఎదురు చూస్తున్నాను."

"అలాగా, చాలా థాంక్స్. పోనీ పోలీసుస్టేషనులో అప్పగించక పోయారా ?"

"అమ్మో - పోలీసులకు అప్పగించటమే! అంత విలువ గలదాన్ని, మీ చేతికి అందటం ఇష్టం లేకపోతే ఆ పని చేసే వాణ్ణే"నాలిక కొరుక్కున్నాడు. హైమ ప్రశ్నార్థకంగా మొహం పెట్టడంతో మరి కొంచెం బలం పుంజుకున్నాడు అతను.

"పోలీసులను నమ్మలేం, ఒట్టి మోసం. న్యాయం అనటమే గాని అన్యాయం అసలు అక్కడే తిష్ఠవేసుకుంది. మీరన్నట్లు పోలీసు స్టేషనులోనే ఇస్తే అది మీదాక చేరుతుందన్న నమ్మకం నాకు లేదు."

"మా నాన్నగారు పోలీసు సూపర్నెంటు" అన్నది తల వొంచుకుని నవ్వుతూ.

"చంపారు. ముందే చెప్పరు కారు"

"ఏమో !"

"అయితే పోలీసులకే అప్పగించేవాణ్ని!"

"ఎవర్ని ?"

అంతర్యాలు ధ్వనించాయి. హృదయాంతరాళాలలో ఏవో అపూర్వ తరంగాలు ఉవ్వెత్తుగా లేచి నేలకూలాయి.

"మీ నెక్లెస్ మీ కందచేస్తాను. ఎక్కడ కలుసుకో మంటారు ?" అడిగాడు.

"మా ఇంటికి రండి !"

"అదిగాక"

"ఏం"

"ఏమీ లేదు. పోనీ ఇక్కడే ఉండండి. ఓ పది నిమిషాల్లో పట్టుకొస్తాను."

"ఇల్లు దగ్గరేనా ?"

"ఆ ప్రక్క వీధిలోనే"

"అయితే నడవండి, నేనే వచ్చి తీసుకుంటాను."

"గొప్పవారు మా ఇంటికి వస్తారా ?"

"ఏం రాకూడదూ?"

"భయం కదూ ?"

"మరేం దొంగా, భయపడడానికి"

గతుక్కు మన్నాడు విశ్వం.

"ఏం కాకూడదా !"

"ఆస్తులు దోచుకో లేదుగా !" నవ్వింది చిరుగా.

ఆ చూపులో భావాలు వేరు. ఆ పలుకులో కరుకుతనం వేరు. అర్థం కాని బాధ, వ్యథ అన్నీ ఎన్నో అందులో గూడు కట్టుకుని కనపిస్తున్నాయి. షాపులోంచి బయటకు రాగానే అడిగాడు.

"మీ కారు రాలేదా ?"

"లేదండీ ! నాన్నగారు క్యాంపు కెళ్ళారు. వీడు మరీ అల్లరి చేస్తుంటే షాపింగు కని బైలు దేరాను."

"మీ అబ్బాయి డనుకుంటా ?"

"కాదు కొడుకే."

"అలాగా" విషాదం ధ్వనించక పోలేదు.

ఆమెలో కూడ ఏదో తీరని వ్యథ, వ్యక్తం కాకపో లేదు. హృదయం బాధగా ఘోషించింది కూడా.

రెండు రిక్షాలు పిలిచాడు విశ్వం.

చెరొక దాన్లో ఎక్కారు.

సరాసరి విశ్వరూపం ఇంటి దగ్గరే ఆగాయి. అదొక పెద్ద బంగళా లాంటి ఇల్లు, ఎన్నో సోఫాలు, రేడియో, రెండు ఫాన్లు, నిలువుటద్దాలు పెద్ద ఫాయలోనే వున్నది. అయితే ఇల్లు బిక్కు మంటోందేం ?

"ఏం ఉద్యోగం" అన్నది సోఫాలో కూర్చుని పరికిస్తూ.

మాట మార్చి "ఎవరి కోసం వెదుకుతున్నారు ?" అన్నాడు.

"ఎవరూ కనిపించరేం ?"

"ఉన్నవాళ్ళు ఎదురుగా కనపిస్తూనే వున్నారుగా. లేని వాళ్ళకోసం వెదికితే ఏం కనిపిస్తారు?"

"అంటే మీరు ఒంటరిగానే వుంటారా?"

"అహా, వంటవాడు, పనిమనిషి వున్నారు."

"ఇల్లు బావుంది. కానీ ఒక్కటే లోపం?" అదోలా చూచి మరోలా నవ్వుకున్నాడు. డ్రాయరులోంచి నెక్లెస్ తీసి యిచ్చాడు.

"నెక్లెస్ లేకుంటే మీ మెడ ఎంత బోసిగా వుందో చూచారా!"

ఒక్కసారిగా ఎదురుగా కనిపిస్తున్న అద్దంలో చూచుకొని గతుక్కుమన్నది. ఆ మాట లన్నప్పుడు ఒక్కసారిగా అతనిని గుండెల లోతుల్లోకి చూచింది. ఆ వాడి చూపులకే అతను అల్లకల్లోలమై మతి పోగొట్టుకొన్నాడు. అసలు ఒక నాటి ఆ చూపులకే పిచ్చిగా మతి పోగొట్టుకొని ఇంత కాలం వెర్రివాడిలా తిరుగుతున్నాడు. ఆ చూపుకోసమే తిరిగి, తిరిగి వెదుకుతున్నది. మరొక్కసారి ఆ చూపు తనను కటాక్షిస్తే జన్మచరితార్థం అవుతుందని ఆకాంక్షించాడు. అప్పుడుండనే అనుభూతి పొందాడు. ఆశించిన చూపు మరొక్కసారి చూచింది హైమ.

అయితే ఆ చూపుకు ప్రేరణ అతని వర్ణన, ఆ మాటల్లో నిజం ఆమెని లొంగదీశాయి. ఆ నాడు ఇలాగే కన్నెత్తి చూడాలనిపింప చేశాయి. ఆ తర్వాత నెక్లెస్ పోయిందన్న విచారంవల్ల కాక, ఆ మాటల్ని తలపోస్తూ, ఆ మూర్తిని

స్మరిస్తూ మూడు రోజులు, నిద్ర మానివేసింది. ఏవేవో ఆలోచనలు చేసింది. వాటిని భద్రంగా హృదయంలో భద్ర పరచుకుంది. నేడు బైటకు తీసింది, మనసు కలత బారింది.

ఆమె నెక్లెస్‌ను మెడలో అలంకరించుకుంటుంది. మునివ్రేళ్ళు సుతారంగా మెడపై నగ్నభాగాన్ని స్పృశిస్తుంటే అనిపించింది. ఒకప్పుడు, ఒక క్షణకాలం తనవేళ్లు ఆ సున్నిత ప్రదేశాన్ని స్పృశించి ధన్యమైనాయిగదా అని. ఆ ఊహాస్మృతి, మధురానుభవం క్షణంలో చెరిగిపోయి, దాని స్థానంలో పెద్ద అనుమానం తిష్ట వేసింది.

అందుకే ప్రక్కనే ఉన్న కుర్రాడి మొహంలోకి తేరిపార చూచాడు.

అనుమానం లేదు. తన ఆశ నిరాశ అయిపోవలసిందే.

"అయితే మీరు వివాహితులన్నమాట ?"

"కాక కన్యనను కున్నారా ?"

"అయితే," చూపులు ఆమె మెడ క్రింది భాగాన్ని గాలించినయ్. అనుమానం ఘనీభవించింది. ఓ సన్న జాజి గొలుసు తప్ప మరేం లేదు. కట్టుకున్న చీర, జాకెట్ కూడా వెలితిగా కనిపించింది.

"మీ కున్నవన్నీ బంగారు గాజులేనా !" అడిగాడు.

"మట్టిగాజులు తొడుక్కునే దాన్నే ఒకప్పుడు." ఆ నెక్లెస్ ఆమె అందాన్ని మరీ ద్విగుణీకృతం చేసింది. ఆ అందాన్ని తను మెచ్చుకోగలడు కాని ఏదో వెలితి !

"ఏమిటి ఆలోచిస్తున్నారు ?" ప్రశ్నించింది.

"ఏమీలేదు. మీరు మీ నాన్నగారింట్లోనే ఉం టారుగా."

"ఆ! రా నన్నారుగా?" కప్పిపుచ్చింది.

ఇంత సౌందర్యమూ అడవి కాచిన వెన్నెలేనా అని వాపోయాడు. భారంగా, బాధగా నిట్టూర్చాడు. కళ్ళలో అప్రయత్నంగా నీళ్ళు తిరిగినయ్.

"వెళ్లొస్తానండి. చాలా థ్యాంక్సు" అన్నది హైమ నిలబడుతూ.

ఒక్కసారి వాస్తవంలోకి వచ్చాడు తన తొట్రు బాటును కప్పిపుచ్చుకుంటూ.

"అలాగే. ఎవర్నైనా కనిపిస్తారా?"

"అవకాశం ఉంటోద్దూ?"

"అవకాశమేగా! అవసరం అనలేదు రక్షించారు. ఓసారి పేలవంగా నవ్వబోయి, ఆగి బయలుదేరింది.

కొన్నిరోజులు ఆలోచనా పూరితంగా గడిచిపోయాయి. అనంతరం అతన్ని కలుసుకోవాలన్న ఉబలాటం కలిగింది. అతని పేరేమిటో తెలియదు. ఊరు తెలియదు. అడిగేదు కాను అనుకుంది. అతన్ని గురించి ఎంత మరచిపోదామని ప్రయత్నిస్తే అంత గాఢంగా ఆలోచన బలం పుంజుకుంటోంది.

తనంత తానుగా వెళ్ళటమూ భావ్యంకాదు, అతను వస్తాడేమోనని రోజులు ఎదురుచూసింది. అవి నెలలుగా మారి జొచ్చాయి. అయినా తన కోసం అత నెందుకు

రావాలి. తను అందుకు అర్హురాలు కాదుకదా! అను కున్నది కూడా.

అనుకుంటుండగానే పని మనిషి చీటీ ఇచ్చి వెళ్ళింది. "మీకిమ్మన్నారు ఎవరో" అని చెప్పి. తీసి చదివింది.

శ్రీమతి హైమవతిగారికి,

వీలు చేసుకుని ఓ సారి కలుస్తారా? నేను ఈ ఊరి నుండి వెళ్ళిపోవాలనుకుంటున్నాను. వెళ్ళేలోగా ఓ సారి మిమ్మల్ని చూడాలని, మీతో మాట్లాడాలనివుంది. అభ్యంతర లేకపోతే, సాయంత్రం ఓసారి రారూ?

విశ్వం.

ఉత్తరం చదివి, ఆరు సార్లు ఆలోచించుకుంది. కానీ ఏమీ అంతు చిక్కలేదు. అందులో అపార్థం చేసుకోటానికి ఏమీ లేదు. అసందర్భంగానూ లేదు. తననేమీ విపరీతపు కోరిక కోరుతూ ఉన్న ధ్వని లేదు. సహజంగా వుంది. ఊరికి వెళ్ళిపోతూ ఓ సారి చూస్తానన్నాడు. అంతేగా! తిరిగి రాడేమో, నిజంగా రాడా! రాకుంటే?

"విశ్వం?"

"నన్ను కానీ ప్రేమించటంలేదు కదా" అనుకున్నది. అయినా కావచ్చు. అందులో అసంగతం, అసందర్భం ఉండి ఆశ్చర్యపడవలసిన విషయమూ అంతకన్నా కాదే!

సాయంత్రం బైలుదేరి వెళ్ళింది.

నీ కోసమే నన్నట్లు విశ్వం వేయి కళ్ళతో ఎదురు చూస్తున్నాడు. ఆ చూపుల్లో వెనకటి ఉత్సాహం స్థానే

దైన్యం గూడుకట్టుకుని వుంది. చాలా విచారంగా వున్నాడు. ఎంతో చిక్కిపోయాడు కూడా.

"వచ్చారా! రారేమో ననుకున్నాను," గుండెల్ని చేతిలో పట్టుకుని స్వాగతం చెబుతూ.

"రమ్మన్నారుగా మరి."

"అంటే మాత్రం వస్తారా? ఎలా!"

"సరే కానీండి, ఆ మాటలకేం అసలు ఊరు వదలి వెళ్ళిపోతున్నానన్నారు. ట్రాన్స్‌ఫర్ అయిందా?" ప్రశ్నించింది సూటిగా కళ్ళల్లోకిచూస్తూ. 'ఏ ఊరు?'

ఏం చెబుతాడు? శూన్యంగా, హృదయాన్ని వెదుక్కున్నాడు. నిజం చెపితే నమ్మదు! అబద్ధం చెప్పడం అదీ బావుండదు. ఎలా సమాధానం చెప్పాలి. తికమక పడ్డాడు.

"మరీ అంత గుండెల్లోకి గుచ్చుకుపోయేలా ప్రశ్నిస్తే ఎలా చెప్పండి?" అన్నాడు భయాన్ని కప్పిపుచ్చుతూ.

"చెప్పకూడదా?"

"నే నెవర్ని అని ఆలోచిస్తున్నారు?" అన్నాడు. ఆమె కళ్ళల్లోకి సూటిగా చూచాడు.

"వేదాంతమా?"

"లేదు చెప్పండి?"

"మీరెవరో నాకేం తెలుసు. తెలియకనేగా అడిగింది.

"నిజంగా తెలుసుకోవాలని వుందా హైమవతిగారూ?"

"ఉన్నది కాని వ్యర్థప్రయత్నమేమోనన్న భయం లేక పోలేదు" అన్నది.

"లేదనుకోండి. కాని తీరా తెలుసుకున్నాక బాధ పడ వలసి వస్తుందే అని నా విచారం,"

"అంత భయ పెడతారా?"

"మీకోసం."

"అంటే మీ ఉద్దేశ్యం."

"మరేమీ లేదు. నూటిగా చెబుతాను. భయపడకండి. నన్ను అపార్థం చేసుకోకండి. దయచేసి...మిమ్మల్ని అమాంతం ప్రేమిస్తున్నానని అనడంలేదు. నాతో లేచిరమ్మని అనడంలేదు, నన్ను పెళ్ళాడమని అనబోవడం లేదు,

"రక్షించారు."

"మీరు ఉన్నతకుటుంబములోని అమ్మాయిగారని నాకు తెలుసు కూడా. ఉద్యోగం, గౌరవం, మర్యాదగల కుటుంబంలోనివారని తెలుసు. యవ్వనంతో, అందంతో వున్నారుగనక, సామాన్యంగా అందరిలాగా నే మీరు ఉద్రేకాలకు లోనవుతారని తెలుసు. ఆ ఒక్క బలహీనతను ఆధారం చేసుకుని, మీ మర్యాదనూ, గౌరవాన్ని, శీలాన్ని వమ్ముచేయటం నా అభిమతంకాదు. నేను కబురంపిందే తడవుగా వచ్చారని, మిమ్మల్ని తేలిక పరచడంగాని, మరేమైనా చేయడంకాని నా వల్ల కాని పని."

"మరి" అన్నది పైకి. లోపల, ఇంత మంచి మనసు కలవాడు అనుకుంటూ,

"అదే చెప్పాస్తున్నాను హైమాదేవీ! మిమ్మల్ని చూచాక నాలో కొన్ని మార్పు లొచ్చాయి. అవి చాలా

బలమైనవి. ఎంతబలమైనవో కొలవడానికి పరికరాలు ఈ ప్రపంచంలోనే లేవేమో! అందుకు మీకు సర్వదా కృతజ్ఞుణ్ణి. మిమ్మల్ని చూచిన తొలిక్షణంలోనే మీరంటే ఒక అభిప్రాయం ఏర్పడ్డది ఆ క్షణంలో మిమ్మల్ని పెళ్ళి చేసుకునే భాగ్యం కలిగితే ఇంక జీవితానికేం కావాలి అనుకున్నాను. నిజాన్ని చెప్పాను, క్షమించండి. అదొక భావన. అది నెరవేరని కోరిక అని క్షణంలోనే తెలుసుకున్నాను మీరు ఫలానా అనీ తెలుసుకోగానే."

"ఎందుకనో?" అన్నది బుంగమూతితో.

"కారణాలు కావాలా? మొదట మిమ్మల్ని కన్యగానే భావించాను. కాకపోయినా నష్టంలేదు. అదివేరేవిషయం, కనక అపుడు ఆ ఆలోచన వచ్చింది. షాపులో మీ పిల్లవాణ్ణి చూచాక మీరు వివాహితులని, కనుక ఆ ఆలోచన రాలేదు అని అనిపించింది. ఆ కోర్కెల గుర్రానికి కళ్ళెం బిగించు కున్నాను. పోతే రెండవది మీస్థితి గస్థితి అని తెలుసుకున్నాక ఫరవాలేదు అనుకున్నాను. అంటే నాకేం అభ్యంతరంలేదు, అయితే మీ అభ్యంతరం వుంటుందని తోచాక నిరాశ ఎదు రైంది. మీకు ఆ ధైర్యం కావాలని, మీకు ఉన్నదని నాకు తెలుసు. అయినా అన్నిటిని మించిన అబద్ధాలాడ్డంఒకటి. నేనెవరో మీకు తెలిస్తే నన్ను త్రుణీకరిస్తారు, పురుగుకన్న హీనంగా చూస్తారని నాకు తెలుసు. ఆపైన నా మొహం కూడా చూడరు. కాగా పరిస్థితులు కొంచెం ప్రతికూలించాయి.

అందుకే, ఇన్ని ఆశలు పెట్టుకున్న మిమ్మల్ని అట్టే వదిలి వెళ్లి పోవలసి వచ్చింది."

"నాకేం అర్థం కావడం లేదు. అందుకే అడిగాను" అన్నది హైమ.

"నేనెవర్నో అని, చెప్పమంటారా? భయపడరుకదా హైమవతిగారు! నేనొక దొంగను అంటే నమ్ముతారా" అని సూటిగా చూచాడు ఆమెలోకి.

"నమ్మను" అన్నది.

"హృదయాన్ని దోచుకునే దొంగనే కాదు, నగలు, డబ్బు దోచుకునే దొంగని!"

"అసంభవం."

ఒక్కసారి పెద్దగా నవ్వాడు. భూమి దద్దరిల్లేలాగా... ఆ నవ్వుకి అర్థం ఆమెకేం తెలుసు.

"క్షమించండి హైమా! సినిమా హాల్లో మీ మెడలో నెక్లెస్ దొంగతనం చేసింది నేను. ఆశ్చర్యపడుతున్నారా, ఎందుకు చేశావని ప్రశ్నిస్తున్నాయి మీ చూపులు, అది అప్పట్లో నా వృత్తి. వృత్తి ధర్మంతో నే దొంగిలించాను. కాని మిమ్మల్ని చూచాక, మీ అందం త్రాగాక, మత్తెక్కిన నిషాలో ఆలోచించాను. మీవంటి భార్య ఉంటే ఈ దొంగ తనం మానేద్దామని, నమ్మండి. ఆ రోజునుంచి మళ్ళీ దొంగ తనం చేయలేదు. ఇక చేయను. మీ సౌందర్యం సాక్షిగా, సౌశీల్యం, సహనం సాక్షిగా చెబుతున్నాను. ఇంక జీవితంలో దొంగతనం చేయను. మీ సాక్షిగా ప్రమాణం చేసి చెబు తున్నాను."

హైమవతికి నోట మాట రాలేదు. చేష్టలుడిగి అలాగే చూస్తు కూర్చుంది. కళ్ళు రకరకాల భావాల్ని వ్యక్తం చేస్తున్నాయి. మొహంపై కవళికలు కథల్ని, కలల్ని చెప్పే స్తున్నాయి.

"అయితే ఊరినుండి వెళ్ళిపోవటం ఎందుకు?" అన్నది బిక్కు బిక్కుమంటూ, గుండెల్ని గుప్పిట్లో బిగించి.

"అదే చెప్పొస్తున్నాను హైమాదేవి! నేను విస్తృతంగా విజృంభించి దొంగతనం చేసిన రోజుల్లో నన్నెవరూ అనుమానించలేదు. ఏ పోలీసు అధికారీ పట్టుకోలేకపోయారు. చాలా మంది పోలీసు అధికార్లు నాకు మిత్రులే. ఇప్పుడు ఆ పని మానుకున్నాక బాధగా వుంది. ఒక గూఢచారి నాకోసం పొంచి వుంటున్నాడు ఈ మధ్య. అతను చాలా ఘటికుడని నాకు తెలుసు."

"మీరు దొంగతనం మానుకున్నారుగా, ఆ విషయం చెప్పేయండి" అన్నది భారం తీరినట్లు.

"అంత తేలిగ్గా అయ్యేపనేనా! చెబితే ఎవరు నమ్ముతారు? ఏ పోలీసు అధికారి దగ్గరకో వెళ్ళి అయ్యా నేను దొంగను అని ముందు నిరూపించుకోవాలి. ఇప్పుడా ఉద్యమం నుండి విరమించుకున్నానని చెప్ప ప్రయత్నిస్తే - మొదటి విషయం నమ్ముతారుగానీ, రెండవది నమ్మరు. అందుకే ఈ ఊరినుండి వెళ్ళిపోయి యెక్కడైనా ప్రశాంతంగా, న్యాయంగా జీవిద్దామని నిర్ణయం. ఆ విషయమే మీతో చెప్పాలని, మీ వీడ్కోలు తీసుకోవాలని రమ్మన్నాను."

విశ్వరూపంలోని పరివర్తనకు దోహదం ఇచ్చింది తను అనుకున్న హేమ. తనకోసం తనను చూచిన క్షణంనుండి ఆయనలో మార్పు వొచ్చింది. అలామారి ఏం అనుభవించాడు. ఏం ఆశించాడు. అతనంటే తనకు సదభిప్రాయమే కలిగింది. అతను దొంగ అని ఈ నాటికి నమ్మలేకపోతోంది. అయినా ఇప్పుడు మంచివాడు. సన్మార్గుడు. అయితే లోపం ఏమిటి? అంత త్యాగాన్ని చేసింది తనకోసం. అందుకు తను ఏం ప్రత్యుపకారం చేసింది? కోరికలు తీరనవసరము లేదా! తనకు అలాంటి కోరికలే ఘనీభవించివున్నాయి. అవి విశ్వం స్ఫురణమాత్రాన కరిగి ప్రవహించసాగాయి. నాటిని అరికట్టాలంటే విశ్వం కావాలి తనకు. తనకున్న అభ్యంతరాలు తనకున్నాయి. కాని నాటి నన్నింటినీ త్రెంచుకోగల ధైర్యం వున్నది. తనకు అవసరం అయినపుడు అయితే అతనంటె మనసు ఉబలాట పడుతోంది. జీవితం ఇలాగే ఉండిపోవాలని భీష్మించుకో లేదు. తను అవకాశం కోసమే ఎదురు చూస్తోంది. మనసు అతని వేపు లాగుతున్నది. తనకు తనుగా అతని పరమై పోయింది ఎప్పుడో. అయితే విశ్వం తనను ప్రేమిస్తున్నాడా అని అనుమానం! ఇప్పుడు అదీ తేలిపోయింది. అతని కేం అభ్యంతరం లేదట. అనుమానపు సంకెళ్లు పెళపెళా తెగిపోయాయి.

"నా కోసం ఇంత త్యాగం చేశావు గదా ..." ఏదో అనబోయి మధ్యలోనే ఆగిపోయింది.

"ఇది త్యాగం కాదు హైమవతీ. నీ రూపురేఖలు, నాలో దినదిన పరివర్తన, అంతే. అందుకే నిన్ను పూజిస్తాను, ఆరాధిస్తాను."

తనను నిస్వార్థంగా ప్రేమిస్తున్న విశ్వానికి తనేం చేస్తున్నది. తన నోదుకు ఆరాధించాలి. తనందుకు అర్హురాలా? తన హృదయాన్ని అతనికే అర్పితం చేస్తే...అవును అంతకన్న ఏం చేయుగలదు తను మాత్రం.

అయితే అదొక త్యాగమే అవుతుంది. దాన్ని తను అంగీకరించినా, సంఘం అంగీకరించదు. కన్నబిడ్డ సాక్షిగా విశ్వానికి తను అంకితమైపోవాలనే అనిపిస్తోంది.

కానీ ...

"నన్ను మీ దాన్నిగా చేసుకోండి. మీ హృదయంలో ఈ అభాగినికి ఇంత చోటివ్వండి. మీకే ఈ హృదయాన్ని దత్తం చేసుకున్నాను" అనిమూగగా ప్రార్థించింది. కానీ పైకి అవే మాటలు అనలేకపోయింది. భావాలు పొంగి కన్నీరుగా ప్రవహించింది. పైట కొంగుతో కళ్లు తుడుచుకున్నది.

"ఛ, ఏడుస్తున్నావా హైమా! నేనెవర్ని నీ వెవరు? నా కోసం కన్నీళ్ళా. నీకు ఋణపడి వున్నాను. నీ అంతటి అమృతమూర్తికి దూరంగా వెళ్ళిపోతున్నందుకు నేను విచారించాలి, నీవు కాదు. కాని ఒక్కటి మాత్రం గుర్తుంచుకో హైమా, ఈ విశ్వం నీ చూపులకే పునీతుడైవాడనీ, నీ హృదయ కుసుమంలోని వాడని [illegible]పగా ఉం[illegible]వుంటే అదే చాలు."

ఆమెకు మరీ కట్టలు తెగిన ప్రవాహం అయింది "లేదు విశ్వం, ఈ హృదయం అంతా నీకే అర్పిస్తున్నాను" అన్నది.

"నిజంగానా హైమా! అంత అదృష్టమా, నీవు నన్ను కనికరిస్తావా?" అంటుంటె కళ్లు ఆర్ద్రాలైనాయి. ఆమె ఒక్క-సారి కట్టలు తెగిన ప్రవాహంలో అతనిపై వాలిపోయింది.

అంతలోనే వాకిట్లో వాన్లు ఆగినయ్. బూట్ల శబ్దం వినిపించింది. కొన్ని జతల బూట్లు, ఇనప పాదాలు గుండెల మీద కవాతు చేసినయ్. ఎంతో బాధ, ఎంతో ఆనందం, ఆశించిన దాన్ని పొందగలిగా నన్న సంతోషం – అది క్షణికమే నన్న విచారం, మాటలు మోయలేని బాధ. ఇద్దరి మధ్యా విద్యుత్తులా ప్రవేశిస్తోంది. ఇద్దరి చూపులలో నైరాశ్యం, విషాదం, సాలెగూడులా గజిబిజిగా అల్లుకున్నది.

మరుక్షణంలో సర్కిల్ రంగనాథం, సబ్ ఇనస్పెక్టర్లు మూర్తి, దాసు, సి. ఐ. డి. ఇనస్పెక్టరు సురేష్‌తో మందీ మార్బలం ఇంటిచుట్టూ కావలా పెట్టి, లోపల ప్రవేశించారు పెద్ద గజదొంగను పట్టుకునే ఉత్సాహంతో. సర్కిల్ రంగనాథం పిస్తోల్ చేతులో గురిచూచి పట్టుకుని ఉన్నాడు. లోపల కావలసిన దొంగ ఏ తుపాకులతోనో రైఫుల్‌తోనూ రెడీగా ఉంటాడన్న అనుమానం.

"అదిగో అతనే" అన్నాడు సురేష్.

"ఎవరూ విశ్వం!" ఖంగారుపడిపోయాడు రంగనాథం. మూర్తి, దాసు మొహామొహాలు చూచుకున్నారు.

"సారీ మిస్టర్ సురేష్, మీరు పొరపడ్డారు" అన్నాడు రంగనాథం పిస్తోలు తీసి జేబులో పెట్టుకుంటూ.

మిత్రుణ్ని అవమానం చేసినట్లు ఫీలైనాడు. అతను ముందుగా లోపల అడుగుపెట్టేసరికి ఎదురైన దృశ్యం. విశ్వం చేతుల్లో వొణికిపోతున్న హైమవతి తెప్పరిల్లి పక్కకు తప్పుకుని నిలబడ్డది. విశ్వం తనే తెగించి—

"రంగనాథం ... క్షమించండి. సురేష్ పొరపాటు పని చేయలేదు. వారు వెదికింది నన్నే. మీరొస్తున్నారనీ నాకు తెలుసు. కాని పారిపోవాలనీ, విమ్మల్ని మభ్య పెట్టి తప్పించుకోవాలని నేననుకోలేదు. నేనుగా మీకు సరెండర్ కావాలని అనుకున్నాను" అంటూవుండగానే—

"మీరు ... ఇక్కడున్నారా" అన్నాడు రంగనాథం హైమకేసి ఆశ్చర్యంగా చూస్తో.

"అవును నేనే" అన్నట్లు బెంగగా చూచింది.

"ఓమాటు ఇలా రండి సురేష్" అని బయట దీసుకు వెళ్తూ రంగనాథం—

"విశ్వాన్ని ఖైదు చేయటం పెద్ద కష్టమైన పనికాదు పైగా అతనే నేరాన్ని అంగీకరించి సరెండర్ కావాలని అనుకుంటున్నవాడు కనుక అట్టె శ్రమ లేదు. పోతే ఆమె సూపరింటెండెంటుగా రమ్మాయి. ఆయన తన చేతుల మీదుగానే అరెస్టుచేస్తే బావుంటుంది. ఇప్పుడే కబురు చేస్తాను" అన్నాడు.

విశ్వం ఆలోచించాడు. పర్యవసానం ఏమిటా అని. నిమిషాలు గడిచిపోతున్నాయి. హైమ ఎంత మంచిది. నా జీవనజ్యోతినే వెలిగించిన అమృతమయి. ఒక్కసారిగా గత జీవితం అంతా కళ్ళముందు కనపించింది. ఎన్నో రంగాలు, ఎన్నో అంకెలు, ఇది చరమాంకం. పూర్వం జీవితంలేదు. ఆ కుహనా జీవనద్వారానికి ద్వారాలు శాశ్వతంగా బంధించి, మరొక దివ్యభవనంలో ప్రవేశపెట్టింది హైమ.

హైమతో కలిగిన పరిచయాన్ని, ఆ తర్వాత పొందిన భావపరిణామాన్ని అనుభూతుల్ని నెమరువేసుకున్నాడు. అంతా విచిత్రంగా వుంది. ఆ అమ్మాయిని మొదట తను ప్రేమించాడు. ఏమో ఆశించాడు. ఆమె సాహచర్యంలో శేష జీవితాన్ని ధర్మపథంలో నడుపుకుందామనుకున్నాడు. ప్రశాంత జీవన స్రవంతిలో తాను నౌక నడపితే, ఆమె చుక్కాని పడుతుందనుకున్నాడు. కలలు కలలేనా, నిజం కావా...... అదొక మధురానుభూతి, యదార్థం కాదా! అయితే—

ఆలోచనలోంచి బైటకు వచ్చేసరికి కళ్ళు మిరుమిట్లు గొలిపాయి. ఎదురుగా ప్రళయమూర్తిలా సూపర్నెంటు ఆయన్ని చూస్తే గుండెలు బేజారెత్తినాయి. హైమ తల వొంచుకుని కన్నీరు మున్నీరు ఏడ్వలేక, మొహం మాడ్చుకొని నిలబడిపోయింది.

"నువ్వేనా విశ్వరూపం?" అడిగాడు.

"ఆ."

చేతిలో బేడీలు గలగలమన్నాయి. ఇనపగజ్జెల తల్లి చిరుతనృత్యం అది.

"ఊఁ" అని హుంకరించాడు రెండు చేతులలో బేడీలు పట్టుకుని ఒక్క అడుగు ముందుకు వేసి విశ్వరూపం. ఆపైన జరగబోయేది తెలుసు. ఏదో ఆశించి ఈ కార్యాన్ని నిరోధించే శక్తిలేదు. అవకాశం లేదు. హైమను చూస్తే, ఆమెను తలచు కుంటే గుండె నీరై పోతోంది. కాని విధి బలీయమైంది. శాసనం అజేయమైంది.

సూపర్నెంటు కళ్ళల్లో నీరు తిరిగింది. ఎదుట ఉన్న మనుషులే కనిపించటం లేదు. అలవాటు చొప్పున కళ్ళకు ఏమీ కనిపించకపోయినా తనకర్తవ్యాన్ని నిర్వహిస్తున్నారు. ఒక చేతికి తగిలించాడు. రెండవ చేతికి తగిలించాడు. రెండవ చేతికి తగిలించగా బాగా మెత్తగా, సుకుమారంగా తగిలింది. ఆశ్చర్యంగా కళ్ళు తెరచి చూచాడు.



# రంగుల నీడలు

పడక కుర్చీ ఆవులించి మత్తుగా నిద్ర పోయింది.

పడక కుర్చీలో నేను, నాలో మెదిలే భావాలూ, నా మెదడులో రేగే ఆలోచనలు. నాకు జాగృతి లేదు. నాలో మెదిలే భావాలకు ఎప్పుడూ జాగృతే. నా మెదడులో రేగే భావాలకు సుషుప్తిలేదు. నేను అలిసి పోయినా, నా మేధస్సు అలిసిపోదు. నేను విశ్రాంతి తీసుకొన్నా నాలోని భావాలూ, ఆలోచనలు విశ్రాంతి తీసుకోవు. నా విశ్రాంతి సమయంలో అవి విజృంభిస్తాయి. అదేదో నాకు తెలియని రహస్యం. నే నెరుగలేని, ఎరుగరాని చిదంబర రహస్యం.

అనుకుంటూంటాను. నేను కాదు, నేను నేనా కాదు. నేను అందరిలాంటి వాణ్ని కానేమోనని. కాకుంటే ఇలాంటి స్థితి నా కెందుకు గలగాలి. ఒక్కొక్కసారి అనిపిస్తుంది, అందరూ, మానవు లందరూ నాలా ఇదే స్థితిలో వుంటారని, వుండక తప్పదని. అందరూ నాలా కలల్లో బ్రతుకుతారేమో! లేక ఏ కొందరో అలా బ్రతక నేర్చుకుంటారేమో మరి! ఇలాంటి మానవ హృదయానికి, మేధస్సుకు అందని అతీతమైన ఆలోచనా కలకలం.

నేనున్నాను—నీవూ వున్నావు. మనచుట్టు అనేకమంది వున్నారు. లేరనుకోవటం భ్రమ. వున్నారనుకోవటం ఆనందం. వుండి నీకూ నాకూ ఒరిగిందేమీలేదు. తెల్సుకోవటం సత్యం. అందుకే నీలో నేనున్నాను. నాలో నీ వున్నావు. అందరిలో

అందరం వున్నాం. అందరం కలిసి అంతు తెలియని మరో అతీతశక్తికి అంకితమై పోయాం. ఇదంతా వేదాంతం. కాదేమో. అయితే అది అంతం కావాలి. కానీ కాదు. అందుకే కాదనిపిస్తుంది.

నేను నేనుగా బ్రతకాలని జాగ్రదావస్థలో అవిరళంగా కృషి చేస్తాను. కానీ అలా బ్రతకలేక పోతున్నాను. నా చుట్టూవున్న నీలినీడలు నన్ను బ్రతుకనీయవు. కనీసం మానవుణ్ణిగా బ్రతకాలని ప్రయత్నిస్తాను. కానీ సాధ్యం కావటం లేదు. ఎందుకనో అర్థం కాలేదు. అర్థం అయినట్లే ఉండి కాకుండా పోతుంది. యుగధర్మమో, మానవ బలహీనతో, వ్యక్తిగతమైన బలహీనతో అర్థం కాదు.

మానవునిగా బ్రతకాలి. అందరిలా అన్ని అనుభవాలను పొందాలి, అన్ని అనుభూతులు పొందాలి, అన్ని కోర్కెలను తనివితీరా అనుభవించాలి. కాకుంటే మానవుణ్ణి కాలేను. కాఫీ హొటలుకు వెళ్ళాలి. ఇస్త్రీ బట్టలు వేసుకోవాలి. మోసం చేయాలి. ఆడంబరం చేయాలి. తెలియక పోయినా తెలిసినట్లు మెలగాలి. నేనే ప్రజ్ఞుణ్ణని భావించుకోవాలి. అలా పదిమంది అనుకునేలా పాటుపడాలి. అప్పుడే ఈ మానవ ప్రపంచంలో మనిషిగా బ్రతికే లైసెన్సు నాకు లభిస్తుంది. ఆ లైసెన్సు పొందటంకోసం అహోరాత్రాలు పడరానిపాట్లు పడాలి, తప్పదు.

అయితే అనుకున్న వన్నీ కాగల అవకాశాలు దొరకటం లేదు. కోర్కెలన్నీ నెరవేరటంలేదు. సంఘాన్ని చూచి

భయపడి కొన్నింటి జోలికి పోవటం మానివేస్తున్నాను. కొన్నింటికి యిష్టం వున్నా లోకం వేలెత్తి చూపుతుందని, అనుమాన పడుతుందనీ దూరంగా పోతున్నా. కొన్ని అవకాశాలు లేక ఒదులుకోవలసి వస్తోంది. కొన్నింటికి అవకాశాలు వుండి అవసరంలేక, కాలం కలిసిరాక మానేయవలసి వస్తోంది. అందుకే కోరనివి లభిస్తున్నాయి. కోరినవి దూరంగా కాకుండా పోతున్నాయి.

వెధవది సినీమాకు వెళ్ళాలని ఎన్నోసార్లు అనుకున్నాను. కానీ వెళ్ళటం పడదు. సంసారం, భార్యా పిల్లలు. తీరికలేక ఒకటి, ఒకవేళ తీరినా జేబు నిండుకోవటం మరొకటి. ఒక రూపాయి మిగిలినా మరో ఖర్చుకు వస్తుంది. ఏమిటో సంసారాలు ఎంత వచ్చినా సంపాదన రోజులో పగలల్లా ఆఫీసులో చాకిరి, పై అధికార్ల ఒత్తిడి, పని వత్తిడి. ప్రాణం విసుగెత్తిపోతుంది. తీరా సాయంత్రం అయ్యేసరికి అలా కొంపకు పోయి నడుం వాలూద్దాం అనిపిస్తుంది. వినోదాలకు అని అవకాశం ఏదీ. సాంసారిక్యాలకే మనలకు అంతు లేదు. కానీ అవి తీరే అవకాశమూ లేదు.

సినీమాకు వెళ్ళాలనిపించింది. బయల్దేరాను. ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు. ఎప్పుడూ లేనిది రిక్షా ఎక్కాను. అందరూ నావైపే చూస్తున్నట్లు, నిలబడి నా పిం[illegible] పర్యను చూస్తున్నట్లు వుం[illegible] నా మట్టుకు నాకు.

ఈకొట్లు, బజార్లు ఎప్పుడు చూచేవైనా కొత్తగా, కొ[illegible] అందాల్ని సంతరించుకున్నట్లు [illegible]వుపిస్తున్నాయి. ఈ మనుష్యు[illegible]

హడావిడి దేనికోసం? వో నిముషం ఆలస్యమైతే కొంపలు అంటు కొంటాయన్న ఆదుర్ద ప్రతివారి నడకలోనూ అవుపిస్తోంది. లోకం ఎప్పుడూ యిలానే పరుగెడుతుందా! కీ యిచ్చిన గడియారంలా అస్తమానం అలరట లేకుండా పరిభ్రమిస్తుందా! దీనివల్ల మానవుడు సాధించే దేమిటి? తృప్తి, ఆనందం, అవి ఎవరిలోనూ అవుపించవు; మళ్ళీ లేనపుడు ఎందుకో ఈ ఆరాటం ఆర్భాటం. అసమర్థుడి జీవయాత్రలా కాలం జీవిస్తోంది. కాలానికి కట్టుబడి ఇరుసు అంటిపెట్టుకొని బండి రెక్కల్లో తిరుగుతున్నారు మనుషులు. ఎవరో ఎందుకో ఆగితే ఎవరు అగుతారు. దేనికో జీవితాలతో సంబంధం వుంది అది తెలియదు. అది తెలిస్తే యిలా పరుగెట్టరు. ఆలోచనల్లో పరుగెత్తుతుంటే "బాబూ యిదే హాలు దిగుతారా?" అన్నాడు రిక్షావాలా.

రిక్షావాడికి డబ్బులిచ్చి ముందుకు సాగాను. బుకింగు కిటికీవగ్గర జనం విరగబడుతున్నారు. అహో ఏమిటీ మనుషులు? రిజర్వుడువద్ద ఎవరు లేరు. టికెట్టు తీసుకొని లోపలకు వెళ్ళాను. బాల్కనీయేమో చాలావరకు నిర్మానుష్యంగావుంది. అక్కడక్కడ కొందరున్నారు.

అబ్బ! ఆ అమ్మాయి ఎంత అందంగా వుంది అనిపించింది. దూరంగా ముందు వరసలో కూర్చున్న అమ్మాయిని చూశాను. ఎవరో ఆ అమ్మాయి ... పసన్నగా, బంగారుబొమ్మలా వుంది. ఒక్కర్తె కూర్చొనివుంది ... వరూ లేరు తోడు. ఎవరో సంపన్న కుటుంబీకురాలై వుండాలి. కాకుంటే ఆ చీర, ఆ జాకెట్టు

ఎంత విలువైనవి. మెర్క్యూరీదీపాల కాంతిలో మెరిసిపో తున్నాయి. మెడలో ఆ నెక్లెసు ఎంతో అందంవచ్చింది. అదే మామూలువాళ్ళు వేసుకొంటే అంత అందంగా వుంటుందా, వుండదు. వుండటానికి వీల్లేదు. ఎంత అదృష్టవంతురాలు. అందానికి తగ్గలావణ్యం. అందుకు మించిన అణుకువ. కళ్ళు అటే చూస్తున్నాయి దొంగగా. నేను కృష్ణుణ్ని అయితే? ఆమె రాధ! ఏం లాభం? కానుగా.

దీపాలు ఒక్కటొక్కటిగా ఆరిపోయినాయి. చుప్పనాతి వాళ్ళు నేను ఆ అమ్మాయికేసి చూస్తున్నానని వోర్వలేక ఆర్పివేశారు. పాడు మనస్తత్వం! చెప్పరానంతకోపం వచ్చింది దీపాలు ఆఫ్ చేసినవారిపై. నా మనసుకు, మనసులోనికోర్కెల స్విచ్ బోర్డుపై చెయ్యివేసి ఆఫ్ చెయ్యగలరా!

సినిమా జరుగుతోంది. చూస్తున్నాను. కానీ చూడటం లేదు. కళ్ళు మరొకవైపు పరుగెడుతున్నాయి. నా కంట్రోల్ తప్పిపోతోంది మనస్సు. కళ్లెంలేనిగుర్రంలా పరుగెడుతున్నాయి భావాలు.

అక్కడినుండి లేచిపోదా మనిపించింది. పోతేమాత్రం ఏమిటి ప్రయోజనం! ఆ అమ్మాయి రాదుగా. రానపుడు పోవడంలో అర్థంలేదు.

ఎవరో అదృష్టవంతుడు అంత చక్కని స్త్రీకి భర్త కాగల అదృష్టం అందరికీ ఉంటుందా! ఈ ఆనందం! ఆ అమ్మాయిని ఊహించుకున్నాను. ఆ అదృష్టవంతుడిని నేనే

అయితే భూలోకంలో ఉంటానా? ఉండను స్వర్గం రుచికరంగా వుంటుందా చెప్పలేను.

అవును. నేను. ఆమె ఆ అందాలరాణి, అప్సరోభామిని. ఆ హెలెన్. ఆమె ప్రక్క నేను. భుజంమీద చెయ్యివేస్తాను. నా వైపు చూస్తుంది. చీకట్లో ఆ అమ్మాయి కళ్ళు మెరుస్తాయి...నీ కోసమేగా అన్నట్లు నవ్వుతుంది.

*  *  *  *  *

సినీమా లేదు.

ఆమె ప్రక్కనే నేను భుజంమీద చెయ్యివేసి నావైపు త్రిప్పుకున్నాను. చీకట్లో ఆ అమ్మాయి కళ్ళు కవ్వించినట్లుగా మెరిసినయ్. "నీ కోసమేగా" అన్నట్లు నవ్వింది.

"రాధా" అన్నాను. తనివితీర కళ్ళలో చూస్తూ.

"ఏం ముకుందం" మామూలుగా అన్నది. నీరసం వచ్చింది నాలోకి.

"నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా రాధా!" అన్నాను.

"భగవంతుని సాక్షిగా."

ఎందుకో నా కళ్ళు నీళ్లు తిరిగాయి.

అవును. రాధ నన్ను ప్రేమించింది. కాదు రాధనే నేను ప్రేమించాను. ఆమె కులీన లక్షాధికారి కూతురు. అందగత్తె. కాలేజీలో చదువుకున్నాం. అప్పుడే నేనంటే ఆశలు పెంచుకున్నది.

"మనం పెళ్ళిచేసుకోవటం సాధ్యం కాదేమో రాధా!" అన్నాను.

"అదేమిటి ముకుందం. డాడీ ఒప్పుకుంటేను."

"నీ డాడీ ఒప్పుకోవటం కాదు రాధా నేననేది. నేను నీకు తగినవాడిని కానేమో- ని బాధ."

వెన్నెల వ్రేళ్ళతో నా పెదాలు అడ్డుపెట్టి "అలా అనకు ముకుందం...కొన్ని సంవత్సరాలుగా మనం ప్రేమించుకున్నాం. జన్మ జన్మాల పుణ్యంగా నా పూర్వజన్మ సుకృతంగా మనం కలుసుకొన్నామని నేను అనుకుంటుంటే."

"నిజమే రాధా...కాని"

"కానీ ఏమిటి ముకుందం...జీవితాంతం నేను నీ దాన్నే. నన్ను కాదంటే అవివాహితగా ఉండి పోతాను. ప్రమాణం చేసి చెబుతున్నా...ఏం ఇంకెవరికైనా మనసిచ్చావా?"

"లేదు మనసిచ్చినవాళ్ళే మోసపోతే."

"అంటే."

"అంటే, మీ నాన్న అనుకుంటున్నట్లు నేను లక్షాధికారిని కాదు రాధా! నాకు తల్లీ తండ్రీ లేరు. ఆస్థిలేదు, ప్రభుత్వం ఉచితవేతనంమీద చదువుకుంటున్నాను."

"నిజంగానా ముకుందం" ఆమె ఆశ్చర్యానికి అంతు లేదు. మనిషి వణికి పోయింది.

"వస్తా ముకుందం..." లేచింది.

"నేనూ వస్తున్నా రాధా."!

"వద్దు. నన్ను మరిచిపో ముకుందం." వెళ్ళిపోయింది. కళ్ళలో నీళ్ళు తిరిగాయి. తెరమీద ఏదో జరుగుతోంది.

సినిమా జరుగుతోంది. ఒక అమ్మాయి. ఎవరూ లేరు. ప్రేమించిన వ్యక్తి పెళ్ళి చేసుకుంటానని మోసం చేశాడు.

అగాధంలో మునిచి వెళ్ళిపోయాడు. దిక్కులేక మొక్కలేక ఒక సత్రంలో అరుగుమీదికి చేరుకుంది. సిగరెట్ వెలిగించుకుంటూ బజార్నపోతున్న నేను ఆ వెలుగులో ఆమెను చూచాను. జాలి వేసింది. ఎవరూ లేరక్కేవుంది, ఒంటరిగా వుంది. నిండా ముసుగువుంది. దగ్గరగా వెళ్ళాను,

"ఎవరూ?" అన్నాను.

"ఎవరండీ" అన్నది.

"ఎవరమ్మా నువ్వు! ఒంటరిగా కూర్చున్నావేం?"

వెక్కి వెక్కి ఏడుస్తోంది.

బజార్లో పోయే కారు వెల్తురు మాముఖాలపైన పడ్డది.

"ఎవరూ...ముకుందం?" అన్నది ఆశ్చర్యంగా.

"ఎవరూ...నా పేరెలా తెలుసు మీకు?" అన్నాను.

"నేను, ముకుందం. సుశీలని."

"సుశీల...ఎవరూ...సుశీల."

జ్ఞాపకం వస్తోంది...వచ్చింది.

"నువ్వు!"

"అవును నేను. నేనే ముకుందం...నా జీవితం యిలా పాడైపోయింది."

"నాతో రా, ఇంటికి వెడదాం" అన్నాను.

"మీవాళ్ళు?"

"ఏమీ అభ్యంతరం చెప్పరులే రా"

నా వెంట వచ్చింది. ఇంటికి తీసుకొచ్చాను, సావకాశముగా కబుర్లన్నీ చెప్పింది.

"అయితే ప్రసాద్ నిన్ను మోసం చేశాడన్నమాట" అన్నాను.

"అవును ముకుందం, నమ్మి మోసపోయాను."

"మీ అమ్మా నాన్న?"

"వాళ్ళకు నా మొఖం ఎలా చూపను. ప్రేమించానని పెళ్ళిచేసుకుంటానని తీసుకొచ్చాడు. ఇప్పుడు కాదని వెళ్ళిపోయాడు. ఏం చెయ్యను, అబలను, చనిపోదామనుకుంటున్నాను. ఆత్మహత్య చేసుకుంటాను"

"వద్దులే సుశీలా, అంతపని చేయకు."

"మరి గతిలేదు."

ఆలోచించాను. నిజమే. సుశీల మంచికుటుంబంలో నే పుట్టింది. కానీ మోసపోయింది. నేను చేసుకుంటే ఒక అభాగినికి రక్షణ కల్పించినవాణ్ని అవుతాను. ఒక అనాధకు జీవితాన్ని ప్రసాదించినవాణ్ని అవుతాను. కానీ కానీ సంఘం ఏమంటుంది. వేలెత్తి చూపుతుంది. నలుగురూ నవ్వుతారు. పరువు ప్రతిష్టలు పోతాయి. అందుకే సుశీలనుండి తప్పించుకోవాలనుకున్నాను.

"అట్లాంటే ఎలాగు సుశీలా. మీ అమ్మా నాన్నా వున్నారు. వారు నిన్ను ఆదరిస్తారు. కన్నకడుపుకదా. నీకేం ఫరవాలేదు. రేపు వుత్తరం వ్రాసి పంపిస్తాను" అన్నాను.

"వద్దు ముకుందం ఆపనిచేయకు. నేను చచ్చిపోయాననే వారు అనుకుంటున్నారు. నన్ను పూర్తిగా మరిచిపోయి

వుంటారు. మానిపోయిన గాయాన్ని మళ్ళా రేపటం మంచిది కాదు. నీ కంత కష్టంగావుంటే వెళ్ళిపోతాలే" అన్నది.

ఏం చేయడానికీ తోచలేదు. దబ్బిద్దామనుకున్నాను. డబ్బిస్తే మాత్రం ఏం ప్రయోజనం? ఎవరు ఆశ్రయ మిస్తారు? అర్ధరాత్రి చెప్పకుండా వెళ్ళిపోయింది సుశీల. ఏమయిందో తెలీదు. చనిపోయిందా? ఆత్మహత్య చేసుకుందా...?

సుశీల జ్ఞాపకానికి వచ్చి అక్కడ కూర్చో బుద్ధి కాలేదు. సినీమా అయిపోయింది. నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ బయటకొచ్చాను.

చీకటి. బజారుల్లో నడుస్తున్న మానవాళి చరిత్రల్ని తిరగేస్తూ చాలా దూరం వచ్చాను. నడుస్తున్న చరిత్రకు, సాగుతున్న యాత్రకూ అంతరాయం ఏర్పడ్డది. ఆలోచనలకు బ్రేకు వడ్డది. తరుణోపాయం. దూరంగా కిల్లీ కొట్టులో దీపం మిణుకుమిణుకు మంటున్నది. ఇరవై ఆరో శతాబ్దపు మనిషిలా సాగుతూ, వూగుతూ, జోగుతూ అంత దాకా ప్రాకాను. రెక్కలు కట్టుకొని వాలేనేమో తెలీదు.

"ఏమండయ్యా...ఏం కావాలి..." అన్నట్టు కిల్లీ కొట్టు చిట్టిబాబు.

"ఒక సోడా...ఒక బర్కిలీ పెట్టె."

సోడా బయ్‌మంటే హైడ్రజన్ బాంబు బుస్సు మన్నట్లుగా ఉంది. రుచిలేని జీవితంలాంటి సోడా కానసక తాగేసి సిగరెట్ వెలిగించాను. ఇంకా ఎవరో వచ్చారు.

"పాపం చాలా మంచి అమ్మాయిరా .... దోవంట పోతుంటే కన్నెత్తి చూడదు" అంటున్నారు.

"మరేరా పాపం" అన్నాడు మరొకడు "రెండు సోడాలు కొట్టవయ్యా" అని సోడాకొట్టు చిట్టిబాబుకు పని కల్పించి.

"మరే ఆ అమ్మాయి మనసులో ఏముందో గాని..."

"అదిగాదులే ఎవరూ ఈ ఈడొచ్చిన పిల్లకు పెళ్లి చేసెయ్యకపోతే ఎట్టాగంటా. మన జాతిలోవుందా అట్టా. వయసు రాగానే కన్ని కట్టుకోదు ఆడకూతురు." అని అంటున్నాడు రెండోవాడు.

"ఏమిటయ్యా గొడవ" కల్పించుకున్నాడు కొట్టువాడు.

"ఓరీ నీదొక మిడిమేళం. దొంగలుబడ్డ ఆర్నెల్లకి కుక్కలరిచినట్లుంది నీ గోల."

"మన డాక్టరుగారు లేరూ ప్రకాశరావుగారు ఆయన కూతురు."

"ఆ కూతురు రుక్మిణమ్మ!"

"ఆ ఆదిగద్దిగది ... మొదటాట సినీమా కెళ్ళిందట. మరేమొచ్చిందో ఏమో...స్పృహతప్పి పడిపోయిందట."

"ఎక్కడ?"

"ఇంకాడ? సినీమాహాల్లో."

"ఆఁ ఆఁ."

"అ ఆఁ లేదు ఉవూ లేదు. ఆవజాన ఇంటి కేసు కొచ్చారు. ఇంతవరకు పాపం స్పృహరాలేదు."

"పాపం! ప్రకాశరావుగారి అమ్మాయి రుక్మిణా?" అను కున్నాను.

రుక్మిణి నాకు బాగా తెలుసు. చదువుకునే రోజుల్లో నేను పాఠాలు చెప్పాను. ముకుందంగారివద్ద తప్పితే నేను ట్యూషన్ చదవనని భీష్మించుకుంది. ఇంటర్ రెండేళ్ళూ ట్యూషన్ చెప్పా.

ఆ రోజుల్లో క్లాసులో బాగానే ఉండేది. కానీ ఇంటి దగ్గర ట్యూషను కొచ్చి ఎంతో సిగ్గు పడేది. పడి రాకుండా ఉండేదా అంటే అలా ఊరుకునేది కాదు. కొంటె చూపు చూచేది. ముసి ముసి నవ్వులు నవ్వేది. వెళ్ళలేక వెళ్ళిపోయేది.

ఒకసారి చూచివద్దాం అనిపించింది.

వెళ్ళాను. అంతా దుఃఖ సముద్రంలో మునిగి ఉన్నారు. డాక్టరుగా రొక్కరే. ప్రాణప్రదంగా పెంచుకున్నారు లతలా. వంటమనిషి విసుగుతోంది. బయట పనిచేసే కుర్రాడు పాలేరు దిగాలుపడి చూస్తున్నాడు.

"డాక్టరుగారూ?"

"రా ముకుందం"

"ఏమిటండి...ఇది"

సవిస్తరంగా చెప్పాడు. విన్నది నిజమే

"కారణం ఏమిటంటారు?"

"అదే అర్థంకాకుండా వుంది..."

"పాపం మంచిపిల్లండి" అన్నాను...ఆమాట అనకూడ దని తెలుసు. ఆశలు ఉడిగాకనే అలాంటిమాటలు అనాలి.

కొంచెం కదిలింది రుక్మిణి......నెమ్మదిగా కళ్ళువిప్పి చూచింది. "నాన్నా!" అన్నది.

"అమ్మ...ఇక్కడేవున్నానమ్మా...ఎలావుంది?"

"వారేరి నాన్నా?"

"ఎవరమ్మా"

"ముకుందం మాస్టారు."

"ఇరుగోనమ్మా"

"ఏం అమ్మాయి రుక్మిణీ" అన్నాను.

కూర్చోండి అన్నట్లు సౌంజ్ఞ చేసింది.

మొహమాటపడ్డాను. ఇవేమిటి వింతచేష్టలు. సంధి ప్రేలాపన కాదుగదా!

"కూర్చోండి మాస్టారూ" అన్నది.

"కూర్చో ముకుందం" అన్నారు డాక్టరుగారు.

కూర్చున్నాను.

నా చేతిని తనచేతిలోకి తీసుకొని—

"మాస్టారూ. మీరు పెళ్ళిచేసుకోరూ!" అన్నది.

ఇదేం జబ్బు. అసలు జబ్బుకు ఈ ప్రశ్నకు సంబంధమేమిటి?

"ఎందుకు చేసుకోను. చేసుకుంటాను".

"ఎవర్ని?"

"ఎవర్నో తెలియదు. ఇంకా నిర్ణయించుకోలేదు."

"సరేలెండి అయితే వెళ్ళండి." అన్నది. అంతే మళ్ళీ మాటాడలేదు.

రుక్మిణి స్థితికి నేను బాధ్యుణ్ణా ?

మళ్ళీ సాగించాను పాదయాత్ర. మనసు చిల్లులు పడుతుంది. బుర్ర బాగా వేడెక్కిపోయింది. కాళ్ళీడ్చుకుంటూ నడుస్తున్నా.

"ఎక్కణ్నుంచిరా ముకుందం" వినిపించింది.

తలెత్తి చూచాను...గోపాలం.

"ఏమిటిరా మాంధాతమహర్షిలా ఆ పోజూ నువ్వూను?"

"అబ్బే ఏంలేదు...ఏదో ఆలోచిస్తున్నాను."

"ఎక్కణ్నుంచి రావడం"

"సినీమాకు వెళ్ళి వస్తున్నా..."

"మరి ఇటు చేరావేం..."

"ఓ" ఇప్పుడు తెలిసింది దోవ తప్పానని. జీవితంలో అన్నీ తప్పటాలే. ఒక్క దోవ నేదేమిటి.

గొంతుక ఎండిపోతోంది...ఎండాకాలమేమో నాలిక పిడచకట్టుకు పోతోంది.

"ఈ ప్రాంతాల కాసిని నీళ్ళు దొరుకుతయ్యా."

"నీళ్ళా...ఒక ఫర్లాంగు నడు హోటలుకు వెడదాం."

నడుస్తున్నాం. కొంత దూరం వచ్చాక ఒక తోట అవుపించింది. బావి, ప్రక్కనే బొక్కెన.

"ఉండరా నీళ్ళు తాగి వస్తాను".

"ఈ బావిలోనా ?"

"ఏం ?"

"మరేం లేదు పాడుబడ్డ బావి!"

"మరేం ఫరవాలేదు మనకేమిటి" అన్నాను.

ఇద్దరం బావి దగ్గరకు వెళ్లాం.

నీళ్లు తోడాను.

"నాలుగు నిమిషాలు ఓపిక పట్టలేవుట్రా ముకుందం" అంటున్నాడు గోపాలం.

నీళ్ళు తాగుతున్నాను.

గాజుల గలగల శబ్దం వినిపించింది. ఓరగా తలెత్తి చూచాను. అవును నిజమే...

వయ్యారంగా వచ్చింది చెట్టు నీడలోంచి బావి గట్టు దగ్గరకు. ఎదురుగా గిలకకు అవతల వైపుగా వెన్నెల్లో కిన్నరలా నిలబడ్డది. గాజులు చప్పుడు మళ్ళీ.

"ఎవరూ?" అన్నాను.

కిలకిలా నవ్వింది. వెన్నెల పులకరించింది. వెన్నెల్లో కళ్లు, పళ్లు మెరిసినయ్...

"ఎవరూ?" అన్నాను మళ్ళీ.

గాంధర్వ కన్యలా కదిలింది. గలగలా నడిచింది. కిలకిలా నవ్వింది. ముందుకు తూగింది. వెనక్కు చూచింది. వాలుగా నవ్వింది.

నేను కదలలేదు, మెదలలేదు,

మళ్ళా గాజులు శబ్దించియ్. వెనక్కు వచ్చింది.

కిలకిలా మన్నది. నా వళ్ళు పూలు తొడిగింది.

వెనుదిరిగి చూస్తూ ముందుకు నడుస్తుంటే ముందడుగు వేయక తప్పిందిగాదు. చెట్లు నీడల్లోకి వెళ్లాను. ఆమె దూరంగా వెన్నెల్లో అవుపించింది.

వెన్నెల్లోకి పరుగెత్తాను, నీడలోకి జారింది.

నీడల దారుల వెంట తోట బాటల్లో నడచాం.

పరుగెత్తాను. ముందు ఆమె వెనుక నేను.

ఒక్కటిగా ఆ తోటలో ఆడి, పాడి దాటాం.

ఒక చిన్న యిల్లు. లోపల మిణుకుమనే దీపం.

"రండి" అన్నది లోపలకు పోయి.

వెళ్ళాను. "ఇదేనా మీ యిల్లు?"

"మాది కాదులెండి, అద్దె కున్నాం."

"పోనీ అదే."

మళ్ళీ నవ్వింది. మోళ్ళు చిగురించినాయి.

"నే వెళ్ళిపోతాను" అన్నా.

"అయితే ఎందు కొచ్చారూ?"

"తెలీక."

"ఏం తెలిస్తే ... ఏమయింది?"

"ఏం కాలేను వెడతాను."

"తప్పదా?"

"ఆఁ"

"అయితే వెళ్లండి." తలుపువోరగా నిలబడ్డది. ముందుకు నడవలేక పోయాను.

"ఒక్కర్తెవే ఉంటున్నావా?" అన్నా.

"లేదు మా ఆయన నేనూ..."

"ఆయనేడి?"

"ఎక్కడికో పోయాడు తాగటానికి. అర్ధరాత్రి వస్తాడు. తింటాడు, చంపినంత పని చేస్తాడు."

"మూర్ఖుడా?"

"కాదు బాగా చదువుకున్న వారే..."

"మరి వూరుకుంటాడా."

"ఏం చేయను, ఆయన్ని ప్రేమించి పెళ్ళి చేసుకున్నాను. డబ్బు కావాలంటాడు. ఇవ్వకపోతే చంపేస్తానంటాడు. ఇదీవరస."

"ఆడకూతురివి డబ్బెలా వస్తుంది" అన్నాను.

గాజులు గలగల మన్నాయి. నీడలో వెన్నెల నవ్వింది.

వచ్చేశాను. నడిరేయి. నారీ హృదయాన్ని తెలుసుకోలేక జేబులో ఉన్న పది రూపాయల కాగితం చేతిలో కుక్కి, కుక్కిన పేనులా బయటపడ్డాను.

వస్తూంటే దోవలో ఎవరో లాల్చీ, పైజమా వ్యక్తి ఎదురైనాడు. చీకట్లో, మామిడి నీడలో పోల్చుకోలేదు.

* * * * *

"పోదామా" అన్నాడు గోపాలం.

"వూఁ."

"ఈ బావిలో ఒక అమ్మాయి పడి చనిపోయింది" అన్నాడు.

"ఏ అమ్మాయి? ఎందుకు?"

"ఆ అమ్మాయే మంచిది. మొగుడు తాగుబోతు. చంపుకు తినేవాడు. ఆమె శీలాన్ని అనుమానించేవాడు. ఒక రాత్రి ఎవరో అటునుంచి రావడం చూశాడట. రాత్రికే చంపి ఈ నూతిలో పారేశాడంటారు. కాదు దెబ్బలు భరించ లేక ఆ అమ్మాయే పడి చచ్చిపోయిందంటారు" అన్నాడు గోపాలం.

"అలాగా!" అన్నాను నిర్వికారంగా...

నిజమేమరి అలాంటి వాళ్ళు ఎందరు లేరు. తీరని కోర్కెలతో, ఆవేదనతో, అలమటించి పోయేవా రెందరు లేరు.

రాధ! సుశీల!! రుక్మిణి!!! నళిని?

నేను!

నేను నేను కాదు! నలుగురి ఆత్మలు. నాలో కలిసి పోయినయ్. అందరిలోనూ నేనున్నాను. నాలోనూ నలుగురు ఉన్నారు. అందుకే నే నెవరో నాకు తెలియటంలేదు.

# కరిగిన కల

ఏమిటో! జీవితం నిస్సారం అయిపోతోంది. రోజు రోజుకూ, ఎదుగు, బొదుగూ లేకుండా పోయింది. ఆశలూ, ఆశయాలూ అణగారిపోతున్నాయి. అనుభూతులూ, అనుభవాలూ, అంతు తెలియని అగాధాల్లోకి దిగిపోతున్నాయి. సాగిలపడ్డ సాయంత్రంలాగా, కోర్కెలు వెచ్చదనాన్ని కోల్పోతున్నాయి. అవకాశాలు ఆకాశాని కెగిరిపోతున్నాయా అనిపిస్తోంది. నా జీవితంలో నవోషస్సులు లేవు. నవోదయాలు లేవు. ఎండి బీటలువారిపోయింది బ్రతుకు.

అలాంటి జీవితాన్ని ఎలా మార్చుకోగలను? ఉద్యోగం ఎదగడానికి భయపడ్డ సంపాదన. సభ్యతనుచూచి భయపడి కుంటుబడిపోయిన వాంఛలు, ఆర్థికంగా అలసిపోయిన ఆనందాలు, యివేగదా? జీవితానికి మిగిలినయ్. ఎంతకాలం, ఎన్ని సంవత్సరాలు చేసినా, ఈ లెక్చరరు ఉద్యోగానికి పెరుగుదలే అవుపించటంలేదు. రికార్డు పెట్టినట్లే పాఠాలు చెప్పడం, కుర్రాళ్ళగోల, అల్లరి, అమ్మాయిల వాలుచూపులు, వయ్యారి నడకలు, చూచిచూచి విసుగెత్తిపోయింది. ఈనాడు కొత్తగాపొందే అనుభూతీ లేదు, ఆనందమూ లేదు. అంతకన్నా సంతృప్తి లేదు జీవితమంతా. కొత్తదనం లేకుంటే ఏం సుఖం వుంటుంది? అందులోనూ బ్రహ్మచారి మాస్టరుకున్న విలువ, గమ్మత్తుగా వుంటుంది. అబ్బాయిలు అనుభవం తక్కువను

కుంటారు. అమ్మాయిలో దూరంగా పోతారు. అందుకే వుద్యోగంలో అలసిపోయానేమో ఏమో. కాలేజీలోవున్నా, కాఫీహోటలుకు వెళ్ళినా, రూముకు వెళ్ళినా ఏకాంతమే. సుఖంలేదు. శాంతిలేదు.

ఆరోజు ఆదివారం కావడం, ఏ భక్తులూ రాకపోవడం వల్ల పాత ఆల్బములన్నీ తిరగవేస్తూ కూర్చున్నాను. అస్పష్టముగా అవుపించిన మూర్తి, మూర్తి నాలో భావాలు చెలరేపడం ప్రారంభించింది. అవును మూర్తి.

అవును మొన్న ఏదో ఉత్తరం వచ్చింది మూర్తి నుండి. ఎవరిదో అనుకుని అవతలపారేశాను. ఎవరో గుర్తుకు రాలేదు అప్పుడు. ఎవరో మూర్తి అనుకున్నాను. బాగా జ్ఞాపకం లేకపోయింది. ఏమిటో వున్నకొందికీ బుద్ధిమాంద్యం కూడా కలుగుతూంది. వయస్సుతెచ్చే మార్పు, గాడి జీవితానికి అలవడటమూ, ఏమీ అర్థంకాదు.

ఒకనాడు మద్రాసులో వుండగా జరిగినసంగతి. ఆనాడు మూర్తిని నేను చూసింది. ఆనాడే అతనితో పరిచయం అయిందికూడా. ప్రెసిడెన్సీకాలేజీలో ఎం. ఏ. చదువుతున్నాడప్పుడు. ఒకరోజుసాయంత్రం సముద్రతీరంలో దూరంగాఎవరూ లేనిచోట కూర్చున్నా. లలిత వచ్చింది. లలితతో కొద్ది రోజుల క్రితమే పరిచయం అయింది. పరిచయం స్నేహంగా మారింది. అది ప్రేమగా మారే ప్రమాదం కూడా వచ్చిపడింది. సముద్రపు గాలి హోరుగా వీస్తోంది. సాయంత్రపు సూర్యుడు దూరాన మబ్బులలో దోబూచులాడుతున్నాడు.

"హల్లో!"

కళ్లు విప్పి చూశాను.

లలిత.

"ఓహెూ! రా లలితా కూర్చో!"

"ఏం వంటరిగా కలలు కంటున్నారు?"

"నీ గురించే."

"మంచిది" అంటూ కిలకిలా నవ్వింది. వచ్చి వడిలో వాలిపోయింది.

మసక చీకటి పడుతూ ఉంది. నిశ్చలంగా లలితవడిలో పసుకుని కబుర్లు చెప్తూ ఉంది.

బాగా వెన్నల కురుస్తూంది. "వెళదామా" అన్నా.

ఇద్దరం లేచాం.

ప్రక్కనే పది అడుగుల దూరంలో ఒకవ్యక్తి కూర్చుని తదేకంగా మావైపే చూస్తున్నాడు.

"మాస్టారు!" అన్నాడు.

వెనుతిరిగి చూచాను.

"మీ అడ్రసు యిస్తారా?"

"ఎందుకు?" అడగాలనిపించింది అడగలేను. చెప్పాను. లలిత అదోలా చూచింది. అతడే, వారంరోజుల తరువాత ఓ ఉదయం కిరణాలకన్నా ముందుగా గది తలుపు తట్టాడు. ఆ వారంలో అతని విషయం మరచిపోయాను కూడా.

"నమస్కారమండీ" అన్నాడు.

"రండీ! ఎవరో ననుకున్నాను" అంటూ లోపల కుర్చీ చూపించి, బెడ్డింగుమీద చతికిలపడ్డాను.

ఎందుకో అతనంటే ఆప్యాయత కలుగుతూంది నాలో.

"ఈ చిత్రం చూడండీ!" అంటూ ఒక పెయింటింగును నాచేతి కందించాడు. అప్పను నేను లలిత ఒడిలో ఉన్నప్పుడు వేసింది. రంగుల్లో చిత్రించాడులావుంది తరువాత."

"మీరు వేసిందేనా... బావుంది... థాంక్స్" అన్నాను.

"మీ కోసమే వేశాను" అన్నాడు.

ఎలా కృతజ్ఞత చెప్పాలో అర్థంకావటంలేదు. గొంతుక తడారిపోతూంది.

"దీని ఖరీదు?" అన్నాను, ఆయన కళ్ళలోకి దీనంగా చూస్తూ.

"వొద్దు. దానికి విలువ లేదు."

"ఉన్నా అంతా ఇచ్చుకోలేను లెండి."

"ఏదో పుచ్చుకోవడానికి వేయలేదు గదా."

"మరి?"

"మిమ్మల్ని చూచాక వ్రాద్దామనిపించింది. వ్రాశాను."

ఒక పాతిక రూపాయలు యివ్వడానికి ప్రయత్నించాను కానీ, మూర్తి తీసుకోలేదు.

"ఒకసారి మీ చిత్రాలన్నీ చూస్తాను అవకాశం కల్పిస్తారు కదూ?"

"అల్లాగే" అన్నాడు.

ఆ తరువాత అనేకసార్లు మూర్తి గదికి వెళ్ళాను. వందల చిత్రాలు, శిల్పాలు, అతను రచించినవి. పిచ్చివానిలా వుండే ఈయనలో ఇంతటి కళాచాతుర్యం వుందని అనుకోలేదు నేను.

ఒక్కొక్క చిత్రాన్ని వివరించి చెబుతుంటే నోరు తెరచి విన్నాను. ఆయన కళారాధనలో పులకించిన వ్యక్తి. నాకు వాటి ఆనూపానూ తెలియదాయె. అప్పటి నుండి మూర్తి నాకు మిత్రుడైనాడు. విడదీయరాని స్నేహాలత లల్లుకున్నాయి మా చుట్టూ.

పాత అనుభూతులూ, గత స్మృతులూ ఒక్కసారిగా కళ్ల ముందు శంపాలతలా మెరిసిపోయినయ్. కళ్ళు చెమర్చినయ్. మూర్తిని చూడాలన్న ఆరాటం ఎక్కువవుతూంది. దగ్గరలోనే విజయవాడలో వున్నాడట. మొన్న వచ్చిన ఉత్తరం తీసి చదివాను అంతే.

ఏ యోచనా లేకుండా ఒక వారం రోజులు సెలవు పెట్టి రైలెక్కాను. రైలుకన్నా ముందుగా మనసు పరుగెత్తుతూంది. ఎప్పుడెప్పుడు మూర్తిని చూద్దామా అన్న ఆలోచన కన్నా ఇన్ని సంవత్సరాల అనంతరం అతన్ని కలుసుకుంటే అనుభవించబోయే అనుభూతి ఎలాంటిదో ఎంచుకున్నాను. రైలులో మనుషులు. వీరంతా నాలా మిత్రుల్ని, చిరకాల మిత్రుల్ని కలుసుకోవాలని పోతూవుంటే యింత అల్లరి చేయరు. కొత్తగా ప్రియురాలి ఆహ్వానంపై వెళ్లే చలం నాయకునిలా వున్నది నా మనస్సు. చిరుచెమట్లు పోస్తున్నాయి. మనస్సు అలసిపోతూంది.

ఈ వ్యక్తితో నా కేమిటి బాంధవ్యం? ఏమీ లేదే! అసలు మూర్తితో పరిచయం అయినాకనే లలిత నాది కాకుండా పోయింది. ఆనాడు వున్న వ్యవధి కాస్తా మూర్తితో కాలక్షేపం చేస్తూ, షికార్లు వెడుతూ, ఆర్టుమీద చర్చలతో గడుపుతూవుంటే లలితకు కోపం వచ్చింది. "నీవు నన్ను అనాదరంగా చూస్తున్నావ్" అన్నది. "నీ ప్రేమ మరొకరిపైకి పోయింద్" అన్నది. ఇంకా ఎన్నో అన్నది.

"అలాంటిదేమీ లేదు లలితా, నువ్వు అపార్థం చేసుకుంటున్నావు?" అన్నాను.

"అవును, తెలుస్తూనే వుంది. మీరు అదోలా మారి పోయారు."

"నే నేం మారలేదు లలితా! నా మాట నమ్ము" అన్నాను.

లలిత నమ్మదు, నమ్మలేదు.

"ఒక ఫ్రెండు కలిసాడు ..."

"కొత్త ఫ్రెండా? అయితే యింకేం?" అని వెళ్ళి పోయింది ఆనాడు తను ఎంత పిలుస్తూన్నా వినిపించుకోకుండా. ఆ ఫ్రెండు ఫలానా అని చెప్పనివ్వింది కాదు.

ఆమె కోపానికి మూర్తి ) ఎం చేయటం ఏమీ మంచిది కాదు. ఆమె కసవసరం ఇలా అని చెప్పటం. అంతే ఆ నాటికీ, నేటికీ లలిత సంగతి తెలియదు. ఎక్కడున్నదో, ఏం పని చేస్తున్నదో, తెలియదు. ఆమెను వెళ్ళి బ్రతిమాలలేదు. క్షమించమనలేదు. మన ప్రేమ శాశ్వతమైనదనీ, అదనీ,

ఇదనీ అనలేదు. లలితకు కోపం వచ్చింది. వెళ్ళిపోయింది. నిజానిజాలు తెలుసుకునే ఓర్పు ఏ స్త్రీకీ వుండదు. తన స్థానాన్ని మరొకరు ఆక్రమించుకుంటే ఏ స్త్రీ సహించగలదు? లలిత కూడా అంతే చేసింది. చదువుకున్నదీ, సంస్కారం వున్నదీ, నాగరికలోకంలో బ్రతుకుతున్న లలిత! అలాంటి లలితే సహనం, ఓర్పు లేకపోతే, ఇలా తనకు దూరంగా పారిపోతే తను చేయగలిగింది ఏమీలేదు. ఏ మూగవృద్ధైనా—

ఆ విషయం మూర్తితో చెప్పిన జ్ఞాపకం.

"స్త్రీ పురుషుల మధ్య స్నేహం స్నేహంగా ఉండదండీ" అన్నాడు. "అది ప్రేమగా మారి వివాహానికి దారితీయాలి. లేదా ఇలాంటి అనుమానాల వత్తిడికి తట్టుకోలేక, గాలి గుమ్మటంలా ఎగిరి పోనైనాపోవాలి." మూర్తి అనుభవం కాదు, భావన. ఎంత చక్కగా జీవితానికిసమన్వయించింది?

స్టేషనులో రైలు ఆగడంలో ఆలోచనలకు బ్రేకు పడింది. ఆలోచిస్తూనే, అనుమానిస్తూనే చేతి సంచి తీసుకుని గుమ్మంవేపు నడిచాను. ప్లాట్ ఫారం అంతా కలయచూచాను కూడా. అంతమందీ, అన్ని వందల జనంలోనూ మూర్తి మొహం అవుపిస్తుందేమోననే. అర్థంలేని ఆరాటం, దొంగ చూపు. అయినా నా పిచ్చి కాకపోతే మూర్తి ఎలా వస్తాడు. ఎందుకు వస్తాడు? నేను వస్తున్నాననైనా అతనికి తెలియదే! ఒకవేళ యింకెవరికోసమైనా వచ్చి ఉండకూడదూ!

ఆశ అర్ధంతరంగా రేకెత్తింది నాలో. నా తలపులు తూగుటుయ్యాల లూగే అసందర్భపు భావాలు. కళ్ళు వెతుకు

తున్నాయ్. చూపుల తీక్షణం. నన్ను ఎవరూ గమనించనట్లే హడావిడి జనం. నెమ్మదిగా భావాల బరువుతో బండి దిగాను. కళ్ళు వెతకటం మానివేశాయి. ఆలోచనలే మిగిలేయి.

ఏమో! మూర్తిని కలుసుకున్నా గుర్తు పట్ట కలుగుతాడా? పూర్వం అంత ఆప్యాయంగా, స్నేహంగా వుంటాడా? మంచి ఉద్యోగం, హోదా ఉన్నదికదా? ఛీ! ఏమిటీ ఆలోచనలు? మాట్లాడనివాడైతే నాకు ఉత్తరం ఎందుకు వ్రాస్తాడు? నిజం మరిచిపోయిన నేరం నాది లలితది కాదు.

అవును. అతనో కళాతపస్వి. వికసించిన అతని భావోద్యానంలో వికసించని పుష్పాలు బహుకొద్ది. వాటి పరిమళాలే అతని జీవితాన్ని పరిమళశోభితం చేస్తున్నాయి అతను కొత్త పుష్పాలను ఆశించడు. కొత్త చివుళ్ళు కావాలనుకోడు. తన కళ, తన ఆరాధన, అనే సంతృప్తి అతని జీవితంలో.

తల వంచుకునడుస్తున్నాను జనాన్ని తప్పించుకుంటూ. ఎదురుగా రెండు చేతులు భుజాల్ని ఆపివేసినయ్. ఆశ్చర్యంలో కళ్ళెత్తి చూశాను. మరో లోకపు తీరాలనుండి జారి ఈలోకానికి దూకాయి ఆలోచనల కళ్ళు.

"ఎవరు?"

"హల్లో...! శర్మా!"

నా కళ్ళను నమ్మేశక్తినే నేను కోల్పోయాను. ఆడబోయిన తీర్థం ఎదురవటం అంటే యిదే.

"హల్లో మూర్తీ! నీకోసమే బయల్దేరాను ఎక్కడికీ ప్రయాణం?"

"అబ్బే. ఎక్కడికి లేదు. బుక్‌స్టాల్ దాకా వచ్చాను. అయినా, ఆదివారం కదా? నీవు రావచ్చనే ఉద్దేశ్యంతో యిటు బయలుదేరాను."

"ఏం? జోస్యంకూడా నేర్చుకున్నా వేమిటి?"

"అదేం కాదు మిత్రమా... ఊహించాను. అయినా పెద్దలు, జ్ఞాపక ముంటామా అనిపించింది కూడా."

"పోనీ యిప్పుడో?"

"చిన్నలమే లే...నడు..."

ఇద్దరం బయలు దేరాం.

వెల్‌కంహోటల్లో కాఫీ త్రాగి వెన్నెల ఎండలో రిక్షా ఎక్కాం. బెజవాడ అంతగా పరిచయుం లేదు నాకు నిజానికి. ఏవో సందులు గొందులు తిరుగుతూంది రిక్షా. అంత మేరా నాలిక కదపనే లేదు...ఆలోచిస్తూనే ఉన్నాను. రిక్షా ఆగింది ఒక మేడ ముందు.

"దిగుదామా?" అన్నాడు మూర్తి.

అటూ, ఇటూ చూశాను రిక్షా దిగుతూనే.

"బావుంది?"

"ఏమిటి బావుంది. కవిత్వం వ్రాస్తారా?"

"కాదు మూర్తి! చక్కనిమేడ. బావుంది. ఐతే పూర్వంలా కాకుండా తమరు కొంచెం మారారన్నమాట."

ఆ రోజుల్లో అంటే మేము మద్రాసులోవున్న రోజులలో మరీ సందులో ఏడేడు గుహాల లోపల వెలుతురు లోపలకు రా భయపడే గదిలో వుండేవాడు.

అదేమంటే ఈ కార్లూ, బంధువులు భరించలేక.... జనానికి దూరంగా వుండటమే మంచిదని యిక్కడ తీసుకున్నాను అనేవాడు.

ఈ యిల్లు అట్లాంటిదికాదు.

మేడమీద బయటకూర్చుంటే దూరంగా కొండలు, అస్తమిస్తున్న సూర్యుడు, అవతలగా కృష్ణానది చక్కగా అవుపిస్తూంది. దివ్యంగా మలయమారుతం వీస్తూంది.

ఆ మేడా, ఆ వాతావరణం, ఆహ్లాదకరంగా ఆనందంగా వుంది. మనసుకు మత్తు కలుగుతుందికూడా. ఏవేవో కబుర్లు చెప్పుకున్నాం. ఆనాటి మద్రాసుజీవితం, ఆనాటి అనుభవాలు, ఆనందాలు సముద్రతీరంలో గడిపిన రోజులు అన్నీ జ్ఞాపకాల పుటలలోంచి చూచుకున్నాం. ఆనాటినుండి నేటివరకు వచ్చిన జీవితపు చరిత్రను సంక్షిప్తంగా చెప్పుకున్నాం.

ప్రొద్దుకూకింది. స్నానం చేద్దామని బాత్ రూంలోకి వెళ్ళాను.

వసంతయామిని రాకే రాకే
వసంత మాధురి రాకే రాకే

అని ద్విజావంతి రాగంలో ఒక కోకిలపాట వినిపిస్తోంది. ఆ కంఠస్వరం వింటూంటే అమృతభాండం వొలికి తనంత తానుగా ఏరులై, నాకంఠంలోకి ప్రవహించిందా అనిపించింది. అబ్బ! అంత తీయని కంఠం! ఈ స్వరం రోజూ వినిపిస్తూంటే యింకేంకావాలి జన్మకు, ఎవరు" అని చెవులు అటూ యిటూ పరుగులు తీశాయి, కాని ఆ జాడ దొరకలేదు. మనసులో

ఆరాటం మనసులోనే అణచుకుని, కొత్తవాణ్ని, అందునా అతిథిని, మిత్రుణ్ణి కావడంవల్ల ఆ పాట, ఆ అపూర్వ గంధ ర్వాంగన సుస్వరం విననట్లే వూరుకున్నాను. మనసు ఎంతో ఆవేదనలో తపిస్తూంది.

తూర్పుకొండలమీదినుంచి చంద్రుడు ఉదయించి, లోకాన్ని చంద్రికామయం చేశాడు. క్రిష్ణమీదనుంచి వచ్చే పిల్లగాలులు వుండివుండి చక్కలిగింతలు పెడుతున్నాయి. ఆనకట్టమీద, దుర్గ గుడిమీద బారులుతీరిన లైట్లు దీపావళి అలంకరణాలను స్ఫురింపజేస్తున్నాయి. ఆరుబైట కుర్చీలు వేసు కుని కూర్చున్నాం క్యారియరులో వచ్చిన హోటలు భోజనం ముగించి.

"ఏం శర్మాజీ, ఎందరు పిల్లలు?" అన్నాడు మూర్తి.

"అదొక్కటే లోపం."

"ఏమో?"

"అంత దురదృష్టం యింకా పట్టలేదు"

"నీ లలిత ఏమైంది?"

"అదో కల?"

ఒక కల ఒక్కసారే వస్తుంది. రెండోసారి వస్తుం దనుకోరాదు.

"అయితే పెండ్లి చేసుకోలేదు?"

"ఆ అవసరం కలుగలేదు."

"రెండూ లేవా?"

"అవును, లేవు!

"అనుమానించకు మరి! నీవు ప్రేమించ తగ్గ వనిత ఇంకా దొరకలేదు."

నేను ముభావంగా వుండటం చూచి—

"మరి లలితో?"

"అది ప్రేమ కాదు, పరిచయం. మరి కొంతకాలం సాగితే ఎలా ఉండేదో?"

"నే నడ్డొచ్చా నంటావు."

"ఛా...! అలా అంటానా? అంతమాత్రానికే కరిగి పోయే ప్రేమ ప్రేమ ఎలా అవుతుంది?"

వినిటో సంభాషణ ఉంతూ దరీ లేదు.

"మరి నీ సంగతో?"

"తెలిసిందేగా! మామూలే!"

"పెళ్ళి?"

"అనవసరం. నా సంపాదన నాకే చాలదు. అయినా పెళ్ళి లేకపోతేనేం, ఆర్టిస్టును, నాకెందుకు పెళ్ళి?"

వినిటో మూర్తి అర్థంకాదు. అతన్ని అర్థంచేసుకోవడం నావల్ల కాదు. నాలాంటి మానవులవల్ల కాదు బహుశా.

అత డొక ఉన్నత భావనావరుడు, కాదనలేం. స్త్రీ సౌందర్యాన్ని అందరికన్నా మిన్నగా అతను తెలుసుకోగలడు. అందరికంటే ఎక్కువగా పూజనీయంగా ఆరాధించగలడు. ప్రకృతిలోని సౌందర్యాన్ని అలా అవగతం చేసుకోగల హృదయం ఎక్కడో, నూటికీ, కోటికీ ఒకటి ఉంటుంది. అందాన్ని ఆస్వాదించాలిగాని, అనుభవించరాదు అంటాడు మూర్తి.

అందుకే సుందరిని శరీర వాంఛలకు వినియోగించుకోడు. చూస్తూ తన్మయుడై ఆ సౌందర్యంలో అంతఃసౌందర్యాన్ని దర్శించి పులకితుడై పునీతు డవుతాడు మూర్తి.

రాత్రి బాగా ప్రొద్దు పోయిందాకా కబుర్లు చెప్పుకుని అలసి నిద్రపోయిన కారణంగా ఎప్పుడు తెల్లవారిందో తెలీ లేదు. కృష్ణమీద పైపొరలం వెచ్చదనాన్ని పుంజుకుంటు న్నాయి. అర్ధనారీశ్వరుడిలా, కొండలు, పడమటివేపు నీడలు కుంచించుకు పోతున్నాయి. బద్ధకంగా వళ్ళు విరుచుకుని ముసుగు తీశాను. సిగరెట్టు పెట్టికోసం వెదికాను. కళ్ళు నులుముకుని సిగరెట్టు ముట్టించి, కాలు క్రింద పెట్టాను. ఎదురుగా ఎవరు, మూర్తి లేదు, ఎవ రీమె.

మూర్తి నిన్న తనకు వివాహం కాలేదని, ఆ ప్రశక్తే లేదనీ అన్న జ్ఞాపకం.

"తొందరగా ముఖం కడుక్కోండి, కాఫీ చల్లారి పోతూంది" అన్నది ఆ లతాంగి.

నా కేమీ అర్ధం కాలేదు. కొండకోనలలో తిరుగాడే సినిమా నాయకుడికి ఏకపత్నీ హితుడికి, అందాల కాణాచికూచి, వయ్యారి మొలకఅప్పగించినప్పుడు కలిగే గగుర్పాటు నాలో...

"మీరు ?" అన్నాను అర్ధంకాక అర్ధోక్తితో.

"ఏమీ కాను, మూర్తిగారు అవసరమైన పనిమీద బయటకు వెళ్ళారు. వచ్చేలోపు మీకు..."అన్నది.

ఏమిటో ఈ మాయా!

ఎవరో ఈ భామినీ!

ఎందుకో యీ గొడవ! అర్థంకాదు, ఎందుకవుతుంది? కావడానికి వీలులేదు. అర్థంకానిదే లేవడానికే వీలులేదు.

"మీరు?"

"క్రిందవుంటాం."

"చచ్చాం" అనుకున్నాను,

"మీరు త్వరగా కాఫీ తీసుకుంటే నేను వెడతాను." అంటూంది.

చక్కని చుక్క. అంతకన్నా ఎంత చనువు. భయం లేదు. సిగ్గులేదు. అభినయంలేదు. ఏమీ దాచుకోదులావుంది.

"మొహం కడుక్కురండి" అంది.

"పోనీ యివ్వండి. బెడ్ కాఫీ తీసుకుంటాను."అన్నాను.

"బెడ్ కాఫీనా?" అన్నది ఆశ్చర్యంగా.

"ఏం? ఆశ్చర్యపడతారు. అలవాటేనండి?"

"వీల్లేదు. అది ఆరోగ్యానికి మంచిదికాదు. ముందు మొహం కడుక్కోండి. అంతవరకు యివ్వను" అన్నది.

నా గుండెలు గుభేలుమన్నాయి. "ఇదేమిటి వింత శాసనం? ఎవ్వడూ ఎవ్వరూ నన్ను శాసించలేదు. ఆమె శాసిస్తూంది. నేనెందుకు వినాలి?" అనిపించింది. ఎదురుతిరిగే అలవాటున్నా, ఆ క్షణంలో ధైర్యం చాలలేదు. బాత్ రూం లోకి దారితీశాను.

"బిందెలో వేడినీళ్ళున్నాయి. స్నానంకూడా చేయండి" అన్నది.

ఏమిటీ బలవంతం? ఈ క్రమశిక్షణ? అర్థంకాక అనుస రించింది మనసులో ఆరాటం.

మూర్తి...ఏమిటి? మూర్తికీ ఈమెకూ సంబంధం? అని పించింది, కాని మూర్తి అలాంటివాడు కాదు. నాకు తెలుసు.

స్నానంచేశాను తప్పనిసరై.

కాఫీ యిచ్చింది. యిస్తూ చూసింది నావైపు.

తీసుకున్నాను. తీసుకుంటూ చూశాను ఆమెవైపు.

ఏ భావమూ లేదు. ఏ వికారమూ లేదు.

"వస్తానండి" అంటూ మేడ దిగింది.

మెట్లు లెక్కపెడుతూ గుమ్మానికి చేరబడి నిలు చున్నాను.

ఎవరీ వనిత? ఏమిటీ పరిచయం? మనసు మనసులో లేదు. ఆరాటం ఆర్భాటంగా మారుతూంది. నిముష నిము షానికీ కళ్ళు ఆమెకోసమే వెదుకుతున్నాయి. అప్సరసలా గాలిలో ఎగిరి, ఏ కిటికీలోనుండో రాకూడదూ? ... క్రిందకి వెడితే కనిపిస్తూందా? ఏమని పలుకరించాలి? ఎందుకు?

ఏమిటో భయం...బాధ......

ఒక గంట ఆలోచనలతో బుర్ర బాగానే వేడెక్కింది. మూర్తి ఎక్కడకు వెళ్ళాడు. ఎప్పుడువస్తాడు అన్న ఆలోచనే రాలేదు. ఆ అమ్మాయి మళ్ళీ ఎప్పుడు కనిపిస్తుంది. అసలు వస్తుందా రాదా అనే ఆలోచన. ఇందాక మూర్తి బయటకు పనిమీద వెళ్ళాడు అంటె ఎక్కడికి అనైనా అడగలేదు నేను. ఎంత వెర్రిపని చేశాను?

ఆమెని చూడాలనే తహతహ నిమిష నిమిషానికి ఎక్కువవుతోంది. రానే వచ్చింది. తలుపులు వోరగా తెరిచి వున్నాయి. సందులోంచి నీడ భాగం లోపల వడ్డది.

"రావచ్చాండీ!" అన్నది.

"ఎవరూ!" అన్నాను.

"నేను!" అంటూనే తలుపు తెరచింది.

"నేను" ఎంత బావుంది. నీమీద అధికారం చెలాయించగల నేను, నీ హృదయాన్ని ఆక్రమించుకోగల నేను అని ధీరోదాత్తంగా అన్నట్లుంది.

"రండి" అన్నాను, కుర్చీలో సర్దుకుని కూర్చుంటూ చిరునవ్వు తెచ్చిపెట్టుకుని. ఆమెలోకి చూచే ధైర్యం లేదు.

"ఇంద టిఫిన్ తీసుకోండి" అని టేబిల్ మీద పెట్టింది.

"మీకు చాలా శ్రమ ఇస్తున్నాను. బజారుకు వెళ్తాను గదండీ?" అన్నాను.

"ఫరవాలేదు, అతిథులను హోటలుకు పంపమంటారా?" అన్నది నవ్వుతూ.

అతిథి. ఆమెకు అతిథినయ్యే అదృష్టం వుందా ఈ జన్మకి.

"ఇలాంటి ఆతిథ్యాన్ని స్వీకరించలేదు ఎన్నడూ!" అన్నాను. అని నాలుక కరుచుకున్నాను.

అదోలా చూచింది.

"అంటే?"

"అంటే కొత్త అతిథులకు, అలవాటు లేదు."

"పోనీండి. అలవాటు చేసుకోండి."

ఆ తర్వాత ఏం మాట్లాడాలో అర్థం కాలేదు.

"మీ పేరు శర్మగారు కదండీ" అన్నది సంభాషణ పెంచుతూ.

"అవును మీకెలా తెలుసు?"

"మూర్తిగారు చెపుతుంటారు మీ గురించి."

"అహా!" అనుకున్నాను."

"మీరు కవిత్వం వ్రాస్తారుగదూ...దొంగ పేరు పెట్టుకున్నా రెందుకో."

"దొరికి పోతానని."

"ఎవరికి?"

"వెతికే వారికి?"

"వెతికే వారికి ఎవరైనా దొరికిపోతారు..."

నవ్వాను. అంతకన్నా చేయగలిగింది లేక.

"ఉంటారుగదూ!"

"అప్పుడే పొమ్మంటారా?" అన్నాను.

"వూ...చమత్కారులే..." అన్నది.

"నాలుగు రోజు లుంటాను......మా మూర్తిగారికి చక్కని స్నేహితురాలు దొరికిందని సంతోషంగా వుంది."

"అవును స్నేహితురాలు మాత్రమే."

"ఊఁ చమత్కారులే" అన్నాను. ఫక్కున నవ్వింది. నాకూ నవ్వొచ్చింది.

"ప్రస్తుతానికి అంతేనా?" అన్నాను, సంభాషణ సాగిస్తూ.

"కాదు లెండి, ఎప్పటికీ నేమో!" అన్నది. నిండుకుండ అయినా తొణక్కుండా వుండదు. అది అభిలాష.

"ఈ ప్రాంతం బావుందండీ. చక్కని ప్రకృతి. సహృదయ మిత్రులు. గాన కోకిలలు."

"కోకిల పాట విన్నారేమిటి?"

"రాత్రి ఆ అదృష్టం కలిగింది."

"ఎలావుంది?"

"అప్సరసలు, కిన్నెరలు ఉన్నారని నిన్ననే నమ్మాను."

"ఎవరో తెలుసుకో గలరా ...!"

"తెలియదు."

"నేనే" అన్నది. మరీ ఆశ్చర్యపోయాను.

"మీరా! మీరు పాడతారా?"

"ఆఁ ఏంలేదు ... ఏదో అనుకోకుండా వుంటే ఒక్క ప్రశ్న...?"

ఏమిటి అన్నట్లు చూసింది.

"మీరు ఏం చేస్తుంటారో తెలుసుకోవచ్చా?"

"రేడియోలో పాడుతుంటాను, నాటకాల్లో వేషాలు వేస్తుంటాను."

"సినిమాల్లో వేస్తారా?" అన్నాను.

"ఆ కోరిక లేదు లెండి."

"పేరు?"

"ఉష."

"బావుంది?"

"ఏమిటి?"

"పేరు.....కాదు మీ పాట."

"కాదు నా బాట."

"ఉహూ...మీ పాట ఒకటి వినిపింవరూ!"

"ఇప్పుడా, రాత్రి విన్నారుగా..."

"తనివి తీరదుగా."

"అయితే ఆ సమయం కోసం చూడండి ఎదురు తెన్నులు..."

ఉషతో ఎంతసేపు మాట్లాడినా అలా కాలం దొర్లి పోతుంది.

"వస్తానండి. భోజనం తయారు కాగానే వస్తాను. యిక్కడే భోజనం."

"అదేమిటి మూర్తి వస్తే హోటలుకు పోతాంగా."

"అదే వద్దన్నాను. పాడు హోటలు భోజనం మానమంటే మానరు వారు. ఎన్నిసార్లు చెప్పినా అంతే. మీ రున్న నాలుగు రోజులు హోటలుకు పోనీను. మా యింట్లోనే. కాదనకండి. మూర్తిగారితో ఏం పేచీ లేదులెండి..."అన్నది.

అని చకచకా మెట్లు దిగింది. మెట్లు లెక్కబెడు తున్నాను జాలిగా నిలబడి. లెక్క తప్పింది.

పదకొండు గంటల ప్రాంతంలో మేడ మెట్లు కిలకిల మన్నవి. రెండు జతల పాదాలు పలుకరించుకుంటూ పై

కొచ్చాయి. ఊహ నిజమే అయింది. అతను మూర్తి, ఆమె ఉష. చెట్టాపట్టాలు పట్టుకుని ఏదో ఆనందా లనుభవిస్తూ వస్తున్నారు.

"ఎక్కడి కెళ్లావ్ ?" అడిగాను.

"కొంచెం లేటయ్యింది. ఏం తోచలేదా ఒక్కడికే...?"

"తోచకేం."

"ఉషవుంటే తోచకపోవడమంటూ వుండకూడదు. ఏం ఉషా ?" అన్నాడు మూర్తి.

"మరే!"

"అందానికి, ఆనందానికి!"

"ఉత్పొత్తి పొగ డ్తలేగా"

"కాక."

ఉలికించాడుమూర్తి. ఉషకు చక్కలిగింత పెట్టినట్లైంది.

"కొత్తవారి ముందర..."అన్నది.

"ఇదేం ప్రణయమా, ఏంభయం ?"

"కాదు ప్రళయం!"

"అదికాదుగదా!"

"కావాలి."

"రాదుగా."

వాళ్ల సంభాషణకు అంతులేదు. ఏమిటో ప్రవర్తన.

"వన్ మినిట్ మిస్టర్ శర్మా" అన్నాడు. అని ఏదో బొమ్మ బైటకు తీశాడు.

"రెడీయా ఉషా" అంటున్నాడు.

ఆ సమయంలో ఉష హావభావాల వయ్యారాలు, వయ్యారపు వంపులు, శరీరపు చమక్కులు అతని కుంచెకు పని చెప్పినాయి. ఆహా! ఏమిటా సౌందర్యం. ఏమిటా ఆకర్షణ. మూర్తి ఆమె వలలో పడిపోయాడనిపించింది.

"మూర్తీ పెళ్ళెప్పుడు?" అన్నాను.

"పెళ్ళా ఆయనకు పెళ్లెందుకండి!" అంది ఉష కల్పించుకుని.

"ఆగటంలో అర్థం?"

"ఆగట మేమిటోయ్ అసలు అవసరం లేదంటుంటే."

మూర్తిని అర్థంచేసుకోలేదా నేను. అతను కళాతపస్వి. ప్రపంచ వాంఛలు లేవు. లేనట్లు అవుపిస్తాడు. సౌందర్యాన్ని అన్వేషిస్తాడు. ఆ సౌందర్యాన్ని చిత్రాలలో గుప్పిస్తాడు. స్త్రీ సౌందర్యాన్నేగాని శరీరాన్ని కోరడా! కాకుంటే ఉషతో ఈ ఆటలేమిటి? ఈ చనువేమిటి? ఆమె అంత చనువు ఎందుకిస్తుంది. పెళ్ళిమాటెత్తితే నవ్వుకుంటాడు. విరాగిగా నవ్వుతాడు. స్త్రీ శరీరాన్ని తాకినపుడు అతనిలో ఉద్రేకాలు కలగటంలెదా? ఉషను తాకితే ఏ అనుభూతి, ఉద్రేకమూ కలగటంలేదా? ఆమెమీద అనురాగమా! కామంలేని ఈ అనురాగానికి అర్థం ఏమిటి! అలాంటి అభిప్రాయాలే ఉషకు వున్నాయా! ఏవేవో వెయ్యి ప్రశ్నలు మెదడును గజిబిజి పరుస్తున్నాయి.

మధ్యాహ్నం భోజనానంతరం మళ్లీ మూర్తి బయట పనివుందని బైలుదేరాడు.

"నేనూ వస్తా మూర్తీ. ఒక్కడికీ ఏం తోచటంలేదు" అన్నా.

"త్వరగానే వచ్చేస్తాను బ్రదర్" అన్నాడు.

"............"

"కాదు. పోనీ ఉష వుంటుందిలే తోడుగా, నే వచ్చే వరకు...ఏం ఉషా మా శర్మను కొంచెం కనిపెట్టివుండకూడదా నే వచ్చేవరకూ."

"ఏం గంధర్వులు ఎత్తుకు పోతారా?" అన్నది నావైపు కొంటెగా అదోలా చూస్తూ.

"అవును అదే భయం" అన్నా.

"పోనీ అలా అయితే తప్పక గార్డ్ చేస్తాను."

మూర్తి వెళ్ళిపోయాడు. "సాయంత్రం పిక్చరుకుపోదాం ముగ్గురం. రెడీగా ఉంటావుగదూ ఉషా!" అన్నాడు వెళుతూ.

మూర్తి జీవితం హాయిగానే ఉంటుంది ఉష స్నేహంతో. ఒంటరిగా ఏమీ తోచదనుకున్నా. కాని ఉష వచ్చింది. ఆమెతో, కొత్తామెతో ఏం మాట్లాడేట్టు? ఎంతసేపని సంభాషణ కొనసాగించేట్టు. ఏవో ఆల్బమ్స్ తీసుకొచ్చింది.

"ఇవి చూస్తారా?" అన్నది.

"ఓ తప్పకుండా."

"అన్నీ ఒంటరి ఫొటోలే......" అన్నాను తల ఎత్తకుండానే.

"తోడు లేరుగామరి."

"ఎందుకనో."

"లేకనే!"

"లేకపోయినా ఉన్నట్లేనేమో!"

గ్రహించింది.

"అలాంటి ఆశలేమీ కనిపించటం లేదులెండి."

ఎంత నిరాశ. ఎంత నిస్పృహ. మూర్తిమీద అంతు లేని ఆగ్రహం ముంచుకొచ్చింది. వనిత తానంతతా వలచింది. చులకన చేస్తాడా అనుకున్నా.

"అయిష్టమా!" అన్నా భయపడుతూనే.

"ఇష్టమే...హద్దులు..."

"ఏమిటో!"

"అదే అర్థం కావటం లేదు."

స్త్రీ అంతకన్న నోరు తెరిచి ఏం చెప్పగలదు. హృదయం విప్పి చెప్పింది. చాలదూ! ఇంకా కొనసాగిస్తే వెక్కి వెక్కి ఏడువదుగదా!

"మీరు కమ్మగా పాడుతారుగదూ... రెండు పాటలు పాడకూడదూ?" అన్నా.

"నిజంగా పాడమంటారా?"

"అబద్ధం ఏముంది."

"అయితే సరే. వీణ తెచ్చుకుంటాను......" అని చెంగున గంతేసి క్రిందకి పోయింది. క్షణంలో వీణ తీసుకొచ్చింది.

పాడింది.

"బావున్నాయి. కానీ ఒక సందేహం."

ఏమిటన్నట్లు కళ్ళల్లోకి చూచింది.

"ఈ పాట లెవరివి ?"

"తెలియదు."

"మరి."

"రేడియో వారిచ్చారు."

"అవి నా వేనంటే నమ్మగలరా ?"

"మీవా ?" అంతులేని ఆశ్చర్యం. ఆశ్చర్యంలో ఆనందం. ఆనందంలో అనుభూతి ఎలా కలుగుతాయో ఉషలో అవుపించింది ఆ క్షణాన.

"థాంక్స్" అన్నది.

"వాటికి యింత సంగీతభిక్ష పెట్టి, చిరంజీవత్వాన్ని కలుగజేసినందుకు మీకు నా ధన్యవాదాలు" అన్నా.

ఆనందంతో మైమరచిపోతోంది.

ఉషలో అందం ఉంది. చదువు ఉంది. సంస్కారం, నాగరికత ఉన్నాయి. కాని సుఖం లేదు. సుఖాన్ని ప్రసాదించేవారు ఎవరా అని ఎదురు చూస్తోంది. కానీ అడగదు. పిలవదు. మూర్తి కావాలని వాంఛిస్తోంది. కానీ మూర్తికా వాంఛ ఉన్నట్లు లేదు. ఆమె స్నేహాన్ని కోరుతున్నాడు. ఆమె ప్రేమను తెలుసుకోలేక పోతున్నాడు. సాహచర్యాన్ని వాంఛిస్తున్నాడు. సుఖాన్ని వాంఛించటం లేదు. మిత్రుడుగా ఉంటాడు. భర్తగా ఉండగలడేమో ఆలోచించదు. కానీ నేను......

నేను......నేను......

ఆ ఆలోచన రాగానే గుండె బితుకు బితుకు మంది. శరీరం వణికిపోయింది. ఏమిటీ ఆలోచనలు ఈనాడు వస్తు న్నాయి. ఉషను చూస్తుంటే మరీ అగ్నిలో ఆజ్యంపోసినట్లవు తోంది. కోర్కెలు వాంఛలు ఎక్కువవుతున్నాయి. విశ్వా మిత్రుని తపోభంగం వస్తుందేమో! ఇక్కడే నాలుగు రోజులుంటే ఇంకేమైనా ఉందా! నాస్థితి ఏమవుతుంది. ఉష ఏమౌతుంది, మూర్తి ఏమౌతాడు. పరిస్థితులు ఎలా మారి పోతాయో! వెంటనే వెళ్ళిపోవాలనిపిస్తోంది.

"ఏమండి ఆలోచనలో వున్నారు" అంటూంది ఉష.

"అబ్బే ఏమీలేదు. సాయంత్రం బండికి వెళ్ళిపోదా మనుకుంటున్నా" అన్నాను.

ఉష షాక్ తిన్నట్టయింది.

"అంత తొందరేం"

"ఏమీ లేదు."

"ఏం తోచటం లేదు."

"తోచక పోవటం కాదు."

"మరి."

"మనస్సు బాగా లేదు."

"మనస్సా శరీరమా ?"

"అంత నిశితంగా అడిగితే ఎలా ?"

"మీరు వస్తారు వస్తారని ఎంతకాలంనుంచో ఎదురు చూస్తున్నాం. ఒక్క రోజులోనే వెళతాననంటారేం మరి."

"ఎదురు చూచారా ? ఎవరు మూర్తి ?"

"మూర్తి. ఆయనతో నేను."

"ఎందుకు ?"

"ఎందుకూ లేదు. మీ గురించి చెప్పారు. మీవంటి మంచివారు లేరని, తనకు ఆప్తమిత్రుడు...."

"కాదేమో ? అయిదేళ్ళాయే కలిసి ఆప్తమిత్రుణ్ణెలా అవుతాను?"

"అప్పుడు వారి జీవితంలో మిత్రుడు అని చెప్పాడు నేది మిమ్మల్నొక్కర్నే, తెలుసా."

నామీద అంత ఉన్నతాభిప్రాయం ఉన్నందుకు మూర్తికి లోలోపలే జోహారు లర్పించాను.

"దానికీ వెళ్ళడానికి సంబంధం ఏమిటండీ."

"అదే సంబంధం."

"అంత మనసు బావుండకపోతే అలా బయటకు వెడదాం రండి. కృష్ణవొడ్డుకు వెళితే బావుంటుంది" అన్నది.

ఎందుకు రమ్మంటూంది? ప్రశ్నించుకున్నాను. ఆలోచిస్తే పిచ్చివాణ్ణి అయిపోయేలా వున్నాను.

"మీయిష్టం" అన్నాను.

"పోదామా?" అన్నది.

"టాయిలెట్ కారూ!" అడిగాను.

"ఎందుకూ ?"

వింతగావుంది. ఆడపిల్ల టాయిలెట్ కాకుండా రావటమా.

ఎవరికోసమని నాకు శృంగారపు సింగారాలు అన్నట్లు వున్నాయి ఆమె చూపులు.

మీా యిష్టం అన్నాను.

పదండి.

బయలుదేరాం.

క్రిష్ణ ఎండి వాగులుగా ప్రవహిస్తోంది. మోకాలిలోతు పాయల్ని దాటి దూరంగా వెళ్ళి ఇసుకపరుపులమీాద కూర్చున్నాం. బ్రిడ్జిమీాద రైళ్ళు అప్పుడప్పుడు చువ్వనాతి తనంతో డిస్టర్బ్ చేస్తున్నాయి మమ్మల్ని.

నిజంగా వెడతారా అన్నది ఉష, అరచేతిలో ఇసుక వేళ్ళసందునుండి జారుస్తూ. ఆ గొంతుకలో ఉత్సాహంలేదు. చిలిపితనంలేదు. ప్రొద్దుటచూపిన కొంటెతనమూలేదు. గంభీరంగా గోదావరి కెరటంలా ధ్వనిస్తోంది. తలెత్తి ఆమెలోకి చూచాను.

"ఏం అలా అడిగారు" అన్నాను.

"ఏంలేదు. వెళ్ళకతప్పదా అని."

"ఉండడం కష్టంగా వుంది. వెళ్ళడానికి మనస్కరించటమూ లేదు."

"అంటే?"

"అర్థం చెప్పమంటారా?"

"దేనికి కష్టం?"

ఏంచెప్పను?

"మిమ్మల్ని చూస్తుంటే నాకు విచారంగా వుంది!" అన్నాను.

"ఎందుకనో" అన్నది నవ్వు విషాదము మిళాయించి.

"మీ జీవితాన్ని అర్థంచేసుకుంటే యింకా భరించలే ననిపిస్తోంది."

"పోనీ తెలుసుకోకండి చెప్పను."

"చెప్పనక్కరలేదు. మిమ్మల్ని మీ చూపులు, మీ మాటలు వింటుంటే అందులో అణగిమణగివున్న బాధలు అర్థమవటంలేదనా వేరుగా చెప్పటం."

ఉషకు దుఃఖం ఆగిందికాదు. పైటకొంగుతో కళ్ళద్దుకుని, ఉబికివచ్చే దుఃఖాన్ని పెదాల్ని ఒత్తుకుంది.

"క్షమించండి మీకు కష్టం కలిగించాను" అన్నాను.

"లేదు కృష్ణా. కష్టం కాదు. నా హృదయాన్ని అర్థం చేసుకున్నవారు ఇంతవరకూ లేరు. తెలుసుకోలేని అంతర్జీవితాన్ని మీరు ఇట్టే గ్రహించారు."

"అలాంటివే అనుభవించిన వాణ్ణి గనక."

నాలోకి చూచింది. పాపం కళ్ళు దయతో ఆర్ద్రాలైనాయి. నా కళ్ళు అప్రయత్నంగా చెమర్చినయ్. బొటబొట కన్నీ రొలికింది. కొండచాటు నుండి తొంగిచూచిన చంద్రుడు చల్లని ఆ వెన్నెల కన్నీట మెరుపు ప్రసాదించింది. ఆలాఆలోచిస్తున్నా, ఉష వేళ్ళు నా కన్నీటిని దయగా తుడిచివేసినాయి.

"ఆ విషయాలు మరిచిపొండి. తలుచుకోవద్దు. నా కన్నీ తెలుసు" అన్నది.

"ఆఁ మూర్తి చెప్పాడా?" అన్నాను.

"ఆఁ అన్నీ చెప్పారు. అందుకే మిమ్మల్ని చూడాలని ఆరాట పడ్డది నా మనసు."

"ఆ విషయాలు ఎవరికీ చెప్పకూడదు అనుకున్నాం."

"ఎవరికీ చెప్పలేదు నాకేగా" అన్నది చెంపల్ని రాస్తో. నాలో ఏ అనుభూతి కరగ లేదు. కళ్లు బైర్లు క్రమ్మినాయి.

"వాడిపోయిన పుష్పం వికసించదు ఉషా" అన్నాను భారంగా.

"మరో పువ్వు పూస్తుంది"

"అబ్బే అది ముళ్ళ గులాబీ."

"జాగ్రత్తగా అందుకో వచ్చు."

"అందకపోతే."

"ప్రయత్న లోపం, ఆత్మబలం లేకపోవటం."

"ఉన్నా అసాధ్యమైతే."

"అసంభవం."

ఉషను ఏం అనగలను! ఎంత ఆత్మ విశ్వాసం, ఎంతటి జీవితాశ, ఆత్మబలం.

"ఇంక వెళ్తాము పొద్దు పోయింది."

"మీరు ఎక్కదలుచుకున్న రైలు."

"పోదు నా కోసం వుంటుంది."

ముభావంగా నడుస్తున్నాం.

"నిజంగా వెళ్ళిపోతారా" అడిగింది.

"అదే చూస్తున్నా, అప్పుడే వెళ్ళిపోతే మూర్తి బాధ పడతాడు."

"అంతేగాని బాధపడే వారు ఇంకెవరూ లేరా?"

"లేరని కాదుగా ఆ బాధ వేరు."

"పోనీ లెండి..."

"కోపమా!"

"నా కెందుకండీ కోపం."

"ఉండమంటారా."

"మీ ఇష్టం."

"మీ ఇష్టమో?"

"చెప్పానుగా..."

ఇంటికి వచ్చాం ... మూర్తి ఎదురు చూస్తున్నాడు పాపం.

"ఏం శర్మా ... షికారు కెళ్ళారేమిటి. ఉష ఏదీ?" అన్నాడు.

"క్రింద ఉన్నది."

"ఏమిటో బ్రదర్ చస్తున్నాం ఈ పనులతో విశ్రాంతి లేదు జీవితానికి."

"అంత వైరాగ్యమా?"

"ఆ నా మొహం."

"అందుకే ఒక ఇంటివాడవు కమ్మనేది."

"అది మినహాయించి యింకేదైనా చెప్పు వింటాను."

"ఉష నిన్ను చేసుకోవాలంటుంది."

"పిచ్చి పిల్ల, ఏమీ తెలియదు" అన్నాడు. మూర్తి తత్త్వం అది.

రాత్రి అంతా అదే ఆలోచించాను. నేనూ, మూర్తి మధ్య ఉష. ఏమిటి పులిజూదం. ఎవరిది గెలుపు. ఎవరిది ఓటమి?

ఉదయం నిద్ర లేచేసరికి ఒళ్ళంతా బడలికగా ఉంది. తల నొప్పిగా కూడా ఉంది. అలాగే ముసుగు పెట్టుకుని పడుకుని ఉన్నాను. మూర్తి ఆఫీసుకు వెళ్ళిపోయాడు ప్రొద్దునే. ఉష వచ్చి లేపేవరకు లేవనేలేదు. ముసుగు దీసి "లేవండీ... ఇంకా ఏం నిద్ర" అన్నది.

"లేదండీ తల నొప్పిగా, బద్ధకంగా వున్నది."

"రాత్రి నిద్ర పట్టలేదా?"

"పొద్దుపోయింది."

"అవును ఆలోచిస్తూ పడుకుని ఉంటారు."

"మీ కెలా తెలుసు?"

"ఆడదాన్ని కదూ!"

నుదురుమీద చెయ్యి పెట్టి చూచింది. కణతలు కాలి పోతున్నాయి. "జ్వరం కూడా వచ్చినట్లుంది?" అంది.

"బహుశా లేదనుకుంటా. ఫరవాలేదు. ముందు కాఫీ తీసుకోండి" అన్నది.

కాఫీ తాగాక ఏదో మందు తెచ్చి కణతలకు పట్టించింది.

"మీ రలా ఆలోచించకుండా పడుకోండి" అంటూ కణతలు పట్టింది.

"మీ కెందుకండి ఈ శ్రమ. నే రుద్దుకుంటా లెండి."

"మాట్లాడకుండా పడుకోండి మీరు." కోప్పడ్డది.

మధ్యాహ్నానికి మరీ తీవ్రంగా వచ్చింది జ్వరం.

"ఉషా ... ఈ జ్వరంలో చనిపోతే ఏమవుతుంది?" అన్నాను.

"ఉష్. ఏమిటండీ ఆ మాటలు?"

"ఏం, భయంగా ఉన్నాయా మాటలు? బ్రతికుండి చని పోయినట్లే నా జీవితం. తెలియదు నీకు."

"నే వెళ్ళిపోతున్నా."

"నిజంగానా ... సరే" నిరుత్సాహం.

"ఏం కోపమా!"

"నా దగ్గర అలాంటిమాట లనకండి. మీకు పుణ్యం వుంటుంది."

"సరేలే."

పాపం, ఆరాత్రి ఉష నిద్రపోలేదు. మూర్తి ఎవరో డాక్టర్ని తీసుకొచ్చి చూపించాడు, మందిచ్చారు.

"మెంటల్‌గా చాలా వర్రీగా వున్నారు. బాగా రెస్ట్ కావాలి" అన్నాడు డాక్టరు.

నిజమే. మెంటల్ వర్రీ. అదిపోవాలంటే యిక్కడ నుండి పోవాలి. పోవాలంటే జ్వరంతగ్గాలి. అది తగ్గాలంటె పోవాలి. పాపం ఉష మంచంవద్దరే జాగారం చేస్తోంది.

"ఉషా, నువ్వు కొంచెం రెస్టు తీసుకోకూడదూ కళ్లెంత ఎర్రబడ్డాయో చూడు నిద్రలేక."

"కంటి ఎరుపు కనబడిందా...కారణం అదికాదే."

అబ్బా! ఏమిటీ పరీక్ష. నేనేం సమాధానం చెప్పను. ఏమిటీ అమ్మాయి హృదయం. ఇంతగా క్షోభిస్తోందే. ఎవరి కోసం. ఎందుకోసం.

"చాలా నీరసంగావున్నావు. భోజనం చేయలేదా?"

"చెయ్యబుద్ధి కాలేదు."

"నాతో నీకూ ఉపవాసమే!"

తల తిప్పుతుంది. కళ్లొత్తుకుంటోంది.

"హరి భగవాన్. ఎందుకు నన్నిక్కడకు తీసుకొచ్చావు అనుకున్నాను.

నాలుగురోజులు గడిచినయ్. జ్వరం నిమ్మళించింది. సెలవులై పోయినయ్. కాలేజీలో జాయిన్ కావాలి.

"వస్తాను ఉషా...సెలవు అయిపోయింది!" అన్నాను ఆ రోజు.

"అప్పుడే వెడతారా! ఇంకా బాగా ఆరోగ్యంగా లేరుకదూ!"

"సెలవు లేదుకదా!"

"మీ యిష్టం...ఆరోగ్యం జాగ్రత్తగా చూచుకోండి" అన్నది.

"చెడిపోయే అవకాశాలు లేవులే!" అన్నాను.

ఆ రోజు ప్రయాణంకాక తప్పలేదు. మూర్తికీ, ఉషకూ నేను వెళ్ళటం ఇష్టంలేదు. నిజానికి ఉష కన్నీరొక్కటే తరువాయి. స్టేషనుకు వచ్చారు యిద్దరూ.

రైలు వచ్చింది లోపలకు ఎక్కాను. ఉష లోపలకు వచ్చింది. ప్రక్కనే కూర్చుంది. బయట కిటికీ దగ్గరగా మూర్తి నిలబడి ఉన్నాడు.

"మళ్ళీ సెలవు తీసుకుని రా శర్మా" అన్నాడు.

"అలాగే వస్తా."

"రైలు కదులుతోంది...రా ఉషా" అన్నాడు.

"ఏమండీ వెళ్ళనా ?" అన్నది నాకేసి చూచి.

ఆమె కళ్ళలోకి చూచాను. ఆ కళ్ళలో, చూపుల వెనుక దాగిన, దాచుకున్న బాధలు, భావాలు నన్ను విషాదుణ్ని చేసివేసినయ్. ఆ చూపుల శైత్యానికి శరీరం పులకరించింది.

రైలు వేగాన్ని అందుకొంది. మూర్తి చెయ్యెత్తి వీడ్కోలు అన్నట్లుగా అలాగే నిలబడి చూస్తున్నాడు.

మూర్తి కళ్ళలో ఆ క్షణంలో మెదిలిన కల...కథగా నడచిన కల చిరిగి, కరిగిపోయింది. రైలు సిగ్నల్ దాటింది.



# నన్ను ప్రేమించరూ?

"ఏమండీ! నన్ను ప్రేమించరూ?"

"ప్రేమా! అమ్మబాబోయ్ ప్రేమే..." అనుకుంటూ చూచాను వెనుతిరిగి.

చిలకలా కులుకుతూ, వయ్యారంగా నిల్చుని, వంపుల్ని సోగ్గా వంటికి పట్టించి, కంటికొనేట్లు మలుస్తూ రతి ప్రతిమలా నిల్చున్నది ఆ చిన్నది.

వంటి నిగనిగలేమోగానీ, కంటి వెలుగు మాత్రం తెల్లగా, కొట్టవచ్చినట్లే అయింది. చూపు నిగారింపు, చెక్కిళ్ళలో దాగిన నల్లగులాబీలు, వెన్నెల చిలికిన పరువం దాల్చాయి. పైటలో దాగిన రొమ్ములు బింకంతో, లలన పొంకానికి పొంగులే అయినాయి.

బొటనవ్రేలు నేలరాస్తూ, క్రీగంటచూస్తూ, సన్నని నడుంపై ఓ చేయి సుతారంగా మోపి, ఆ వైపుగా తిరిగి, ఈ వైపుగా చూచి నవ్వింది.

"ఎవరు నువ్వు?" అని పరువుగా, పరువాన ఉన్న చిన్నదాన్ని చేరి అడగటం నేరమే అయినా, చెంత చేరిన చిన్నది, బింకాన పోలేదు గనక, మనకుగా జపాలు సిగ్గు జత చేసి, బెట్టు చేయవచ్చు. 'అడగవోయ్' అని మనిషిలో మనిషి కవ్వించటం, నేను మనసా సై యంటం జరిగి...

"నువ్వు?" అన్నాను. పైకి అనుకున్నట్లు ఆలోచనల్ని ముడివిప్పుతున్నట్లు అభినయంపట్టి.

"నేనే" అన్నది చిన్నది భద్రంగా.

అందులో నే ఉన్నది "నేనంటే నేనేసుమా" అన్న ధ్వని. అలనాడు వరూధిని ప్రవరుణ్ణి నిలవేసిన తీరది.

"ఆమాత్రం తెలీదుటోయ్ బ్రహ్మచారీ" అన్నట్లు చూచాయి ఆమె కనుదోయి.

రెండు కళ్ళలో ఏడేడు రంగుల్ని రంగరించుకుని, ఆ మొత్తాన్ని ప్రోగుచేసి వెలుగు తెలుపును ఒత్తిగా చేసి వెలిగించుకుని చూచాను. దివ్యంగా ఉన్నది అమ్మాయి.

"అసలు నిన్నెందుకు ప్రేమించాలి?" అన్నాను కొంటెగా......ఒంటిగా ఉన్న వనజాక్షిని చూస్తే బ్రహ్మకైనా రిమ్మ తెగులేగద!

"అందుకే" అన్నది కోపంగా నవ్వి.

"బాబోయ్. నావల్ల కాదే"

"ఏం సంగనాచులండీ......నే బాగోలేనా?" అన్నది ప్రశ్న వేస్తూ.

"నువ్వు? నాకు తెలవదు..."

"నువ్వు నాకు తెలుసుగాని, ఆలోచించి చెప్పండి. నేను బాగున్నానో లేదో....నన్ను ప్రేమిస్తారో లేదో చెప్పండి." అన్నది రెండో చెయ్యి రెండో నడుంపైకి వాలి పిరుదుల పై భాగాన బింకంగా నిలబడ్డది. చూపులో కొంచెం వేడి సోకింది.

ఇదేం పరీక్షరా భగవాన్! ఈ అమ్మాయి ఎవరు? ఎందుకొచ్చింది? ఈ అఘాయిత్యం ఏమిటి...బ్రహ్మచారినే.... ఆంజనేయస్వామి భక్తుణ్నే......'కన్నుదోయికి నన్యకాంత లడ్డంబైన' పద్యం బట్టియం వేసినవాణ్ని. ఏమిటీ నాకీ పరీక్ష. బ్రహ్మచారిగాడు కొంచెం అందంగా ఉన్నవాడు, చదువు సంధ్యలు వెలగబెడు తున్నవాడు, ఒంటరిగా, రూంలో ఉంటే వచ్చే చిక్కే ఇది. ఈ అమ్మాయెవరో కిలర్ కథ చదివినట్లుంది, గొడవ.

గట్టిగా ఓ నిశ్చయానికి రాక తప్పలేదు.

"అసలు నువ్వెవరు చెప్పు" అన్నాను. లేకుంటే పోలీసులకు ఫోన్ చేస్తానన్నంత ధీమాతో.

కమ్మగా నవ్వింది.

"అట్లా దోవకిరండి. నన్ను చూడలేదూ ఎప్పుడూ?"

"ఉహుఁ."

"అబద్ధం."

"నిజం."

"ఎక్కడ?"

"ఎదురింట్లో."

"ఆఁ...నువ్వా...భానుమతివా పక్కిలాయిలే" అనుకుని. అనలేక నిభావుంచి, నిభాయించి చూచాను.

"............"

"కాదు నువ్వుకాదు, నాకు టోపీ వేస్తున్నావ్"

"ప్రేమకు టోపీ" అన్నది నవ్వుతూ.

"అమ్మ బాబోయ్. ప్రేమ"

"అయితే నన్ను ప్రేమించరా ?" అన్నది ఏడుపు మొహంపెట్టి.

"ఒద్దులే. ఈవాల్టికి ఊరుకుందూ...మా బుజ్జిగదూ"

"రేపు ప్రేమిస్తారా మరి ?"

"ఛ...ఛా"

"మరి ప్రేమలేఖ వ్రాశారెందుకు ?"

"లేఖా ! నీ కా ?"

ఎదురింటి పై భాగంలో సుబ్బారావుగారి మేనకోడలు భాను పైటకొంగు నోటి కడ్డంపెట్టుకుని నవ్వుతోంది. పిలుస్తోంది మావైపు చూస్తూ...

"ఏయ్ మొద్దూ...లచ్చిమీ" అని ముచ్చటగా.

"వస్తున్నా నమ్మాయిగోరూ" అంటూ అటుతిరిగి... ఇటు తిరిగి.

"అమ్మాయిగారు పిలుస్తున్నారు వస్తా..."అన్నది.

"ఏయ్ అమ్మాయ్ నీ పేరు ?"

"నా పేరా ? మీకెక్క వలసింది...భాను—మతి—" తుర్రుమంది.

*    *    *    *

పోయిన రెండు నెలకు మళ్ళీ కనిపించింది పెళ్ళి పందిట్లో. ఈసారి నాడు పాడుచేసిన చిరునవ్వులు ఈనాడు పందిరైరై విరబూసినయ్. పరిమళాలు వెదజల్లింది సొంత పెళ్ళిలా. తానే పెళ్ళికూతురులా కులికింది లచ్చిమి. ఇల్లంతా తానే అయి, తానే అన్నీ అయి, అటు పెళ్ళివారింట, ఇటు

విడిదింట తెగ తిరిగింది. లేడిలా చెంగు చెంగున గెంతింది. ఉరకలు, పరుగులూ పెట్టింది.

గదిలో ఏకాంతంగా కూర్చుని, నాటి సాయంత్రం రాత్రికి కలుగబోయే మధురానుభూతుల్ని లేతమలపాకు లతో కలిపి నములుతూంటే చెంగున లోపలికి వచ్చింది. సిగ్గు మొగ్గయింది. కుంచించుకుపోయింది నన్ను చూచి.

"ఏం లక్ష్మి నువ్వే పెళ్ళికూతురిలా సిగ్గరివయిపోతు న్నావ్" అన్నాను.

"అంత అదృష్టం కూడానా బాబూ......" అన్నది ఒక్కసారిగా ముఖంలో రంగు మారిపోయింది.

"నా పేరు లచ్చిమి కాదండీ మార్చేసుకున్నా" అన్నది.

"అదేం?" అన్నాను.

"నేను సినీమాస్టారు జమునలాగా ఉంటా గదండీ... అందుకని జమున అని పేరెట్టుకున్నానండి. బాగుంది కదండీ."

"ఉహ్హ బాగులేదు. నువ్వు అచ్చం మాలాసిన్హాలా ఉంటావు. కాకపోతే వహీదా రహ్మాన్‌లా సన్నం...అందుకు మాలా అని పెట్టుకో" అన్నాను.

నా కళ్ళల్లోకి అదోలా చూచింది. ఆ చూపుల్లో వింత పరిమళాలు, వింత సోయగాలు, మత్తెక్కిన వాంఛలు...... ఈడేరని ఈప్సితాలు...ఎన్నో......

"అట్టాగే మీ ఇష్టం" అన్నది నేల చూస్తో.

"ఏం వచ్చావు?"

"నేను బావున్నానా."

అని తుర్రున పారిపోయింది.

ఏమిటీ పిల్ల ? ఏమిటి దీని అర్థం ? తత్వం! నవ్వు కున్నాను ఆ క్షణంలో.

భానుమతితో పెళ్ళిఅయిపోవటం ఓ అదృష్టం. ఓ అంద మైన అమ్మాయిని ప్రేమించం కష్టం. ప్రేమించిన అమ్మాయినే పెళ్ళాడటం అంతకన్నా కష్టం. అది చాలామందికి లభ్యం కాని వరప్రసాదం. అందుకే నా జన్మ ధన్యం అనుకున్నాను.

భానుమతి చదువుకుంది. కాలేజీలో చదువుతున్నప్పుడే ప్రేమించటం జరిగింది. ఆమె నిజంగా అందమైంది. అందాన్ని ఎలా మెరుగులు దిద్దుకోవాలో బాగా తెలుసు భానుకు. ఏ చీర కట్టినా, ఏ నగ వేసుకున్నా అందంగా ఉంటుంది. అసలు భాను శరీరం సోకగానే వాటికే శోభ, సౌందర్యం అబ్బేయి. అలాగే ఆకర్షించింది నన్ను. నా గదికి ఎదురు మేడ వారిది. చూడగానే ప్రేమించకుండా ఉండలేక పోయాను. అదృష్టం వాకిట కాపున్న దేమో ఇద్దరినీ ఒకటి చేసింది.

ఆ రోజు రాత్రి, తొలి రేయి, వలపుల వెన్నెలలు పరుచు కున్న వేళ...హృదయకుసుమాలు వికసించిన వేళ. సిగ్గుదొంతరల మల్లె పందిరిలో, భానుమతిని తొలిసారిగా దగ్గరగాచూచాను.

అవును, భాను...నా స్వప్నసుందరి. ప్రేమలాహిరి కలల పంట... అనుకుంటూ మత్తుగా, ఆశగా భానులోకి చూచాను.

ఆ కన్నుల్లో కాంతి ... కాంతినీడ చీకటి. ఇంతకన్న లక్ష్మి చూచిన చూపు మేలు అనిపించింది. పెళ్ళికూతురు సిగ్గా... కాబోలు అనుకున్నాను.

"భానూ" పిలిచాను గాఢంగా, ప్రేమగా...గత జన్మ పరిచయాన్ని, అనురాగాన్ని నేటివరకు నిగ్రహించుకున్న ఆత్రుతతో.

ఊహుఁ! తలెత్తలేదు, చెంగున చేతుల్లోదూకి గువ్వలా కౌగిలిలో ఒదిగిపోనూ లేదు, పైగా...

"నన్ను ప్రేమిస్తున్నారా ?"అని అడిగింది. అది అశని పాతం...పిడుగు.

"అదేం మాట భానూ!" అన్నాను దగ్గరగా వెళ్ళి భానుచేతిని నా చేతిలోకి తీసుకుంటూ.

"నిజంగా నన్ను ప్రేమిస్తున్నారా చెప్పండి?" అన్నది.

పెళ్ళయిన ప్రతి అమ్మాయి తొలిరేయి ప్రియునివశమై పరవశమై పోయేముందు అలా అనవలె కాబోలు.

"నా సర్వం నీవే. ప్రపంచంలో నిన్నుతప్ప మరెవర్నీ ప్రేమించను. అసలు జన్మ ఎత్తిందే నీకోసం. బ్రతికి బట్ట కడుతుందీ నీకోసమేగా—అవంటూ" అని మనసులో గిజగాడి గూడులా ఉన్న ప్రేమ డైలాగుల్ని వప్పగించాలి మరి. ఆ ప్రయత్నంలో ఆలస్యం. ఆలస్యానికి తట్టుకోలేడు మగవాడు.

ఆ ఊపులోనే ఎన్నో బాసలు చేయించుకుంటుంది ఆడది. మధురలోకాలు చూపిస్తుంది.

'మీరు అపరమన్మథులు, నలకూబరులే' అంటుంది.

'మనిద్దరం ప్రేమపక్షులమై కలకాలం ఇలా ఒకటిగా ఎగిరిపోదాం' అనిపిస్తుంది.

"మన ఇద్దరి దాంపత్యం ఎవరూ విడదీయరానంత గట్టిగా అతుక్కుపోవాలి. ప్రళయం వచ్చినా మనం దూరం కాకూడదు" అంటుంది.

అలాంటి దేదో భానుమతి కోరుకున్నదేమో అనిపించింది.

"ఏమిటి భానూ, నన్నూ, నా పవిత్రమైన ప్రేమను శంకిస్తున్నావా!" కావాలంటే నా హృదయాన్ని అడుగు, అదిగో ఆ అంబులి మామనడుగు, ఈ మామలు నడుగు" అనేశాను ధైర్యం చేసి.

ఊహు అన్నది మరేదో రహస్యం ఉన్నట్లు.

"మీరు నన్నెందుకు ప్రేమించారు అన్నది" పైగా.

నా కర్మకాలి ప్రేమించానేమిటి. ఏదో ఎదురింటి అమ్మాయిగదా ఒంటరిగా వున్నది అనుకుని గాలం వేశాను... గాలంలో పడ్డదిగా అనుకున్నాను...అయినా పెళ్ళయిన క్షణం నుండి భాను, అప్సరసలా అవుపిస్తోంది.

"ఏం ప్రేమించటం తప్పా. అందంగా ఎందుకున్నావ్ మరి."

"నాకన్న అందమైన వాళ్ళు లేరా?"

"ఉన్నారు. లేకనా...లభ్యం కావద్దూ."

"లేదు భాను. నువ్వే దేవతవు. అతిలోక సౌందర్య రాజ్ఞివి" అనాలనిపించింది. కాని అనలేదు.

"ఏమో నాకు తెలియదు భానూ...ఈ ప్రశ్న నన్ను నేను ఎప్పుడూ వేసుకోలేదు. నీవు వేస్తావనీ అనుకోలేదు.

ఎందుకు చెప్పు త్రైంవేస్తు, రా" అంటూ చెయ్యిపట్టుకుని మంచంమీదికి లాగాను. వచ్చి వడిలో వాలింది.

కళ్ళలోకళ్ళు పెట్టి...కంటిలోతుల్ని వెతుకుతూ అడిగింది.

"నిజంగా నన్ను ప్రేమిస్తున్నారు కదూ! నన్ను మించి కోరదగింది మరేం లేదు కదూ!"

"ఉన్నది భానూ లేకేం. బ్రతుకున్నదీ. ఉజ్వలంగా, సుఖంగా బ్రతకటం, జీవితంలో ఆశించిన వాటిని సాధించటం అవీ ముఖ్యం" అన్నాను.

"అయితే నన్నెందుకు చేసుకున్నారు ?"

"సుఖంకోసం, సుఖ జీవనానికి పునాదిలాంటిది గృహిణి, గార్హస్థ్య జీవితం, సుఖంగా బ్రతకటం అనేది జీవిత ధ్యేయం గానీ ఉత్తి సుఖమే కాదు."

భాను మాట్లాడలేదు.

నవ్వింది వేదాంతిలా, విరాగిలా నవ్వింది. ప్రపంచం పోకడను విస్మరించే యోగుల నవ్వు అది. అప్పట్లో అర్థం కాలేదు. ఇప్పటికీ, ఎప్పటికీ అర్థం కాదేమో కూడా.

అది తొలి రేయి.

* * * *

నిజం నిప్పులాంటిదైనా, నిజానికి కటికచేదుగా ఉంటుంది. బ్రతుకు బండి ఇరుకు గతుకుల్లో పయనిస్తుంది. అప్పుడు భయంకరంగా ఉంటుంది అనుభవం. అందుకే జీవనయాత్రలో, తొలి రేయి కలలు కల్లలు కావటం జరుగుతుంది. వలపుకుసుమాలు వాడిపోయి, రాలిపోవడం జరుగుతుంది.

భానుమతి కంటి లోతుల్లోకి చూస్తూ కూచో బుద్ధేస్తుంది. ఆమె అందాన్ని కావిలించుకుని నిద్రపోవాలనిపిస్తుంది. సుషుప్తిలో, ఆమె హృదయంలో హాయిగా, మెత్తగా నిద్రపోదామనిపిస్తుంది. కాని సాధ్యం కావటంలేదు.

అవసరాలు అంతకు మించి, బలంగా పనిచేయటం ప్రారంభించాయి. ఆకలి తీరాలి, అవి ప్రధానం కాదు. మద్రాసులో ఓ మూల చిగిర్చిన ప్రేమ కుసుమం, మరో మూలకు విసిరేసింది. ఉద్యోగం తప్పనిసరి. కేవలం ప్రేమిస్తూ కూచుంటే గడవదు. జీతం చాలీచాలనిది, ఇరుకు బ్రతుకు, ఇరుకు ఆశయాలు, నెరవేరని కోర్కెలు.

భానుతోటి కలలు బంగారు కలలే.

వాస్తవంలో అవే ఇరుకు వలలు.

ఈ మధ్యకాలంలో సంసారం ఆరంభించాక భానుకు ఒక్క చీర కొనలేదు, నగ కొనలేదు, సరిగదా ఉన్న వాటిని కొన్నిటిని మార్వాడి వద్ద తాకట్టు పెట్టవలసి వచ్చింది. సిని మాలకు, షికార్లకు తీరికలేదు. ఉద్యోగం కాక పైరాబడికి కక్కుర్తి.

ఓ రోజు నా దైన్య స్థితిని చూచి భాను కన్నీరు కార్చింది.

"మీ ఆరోగ్యం మరీ పాడైపోతోందండీ" అన్నది.

"ఏం చేయమంటావ్" అన్నాను.

"రాత్రి, బవళ్ళు అంతగా కష్టపడకండి."

"బ్రతికే దెలా?"

"ఉన్నదాంతోనే సరిపెట్టుకుందాం."

"చాలదు. రెండో పూట వస్తే."

"పోనీ — ఓ సలహా చెప్పనా?"

"చెప్పు" అన్నట్లు చూచాను.

"కోపగించుకోరు కదా?"

"నేనూ చదువుకున్న దాన్నేగా ఉద్యోగం చేస్తాను. వేణ్ణీళ్ళకు చన్నీళ్ళు తోడు ... ఇద్దరి సంపాదన కలిస్తే సుఖంగా సరిపోతుంది."

"సుఖం!" అదేదో కొత్తమాట.

"చూదాంలే" అన్నాను.

"ఏం ఇష్టం లేదా?"

"ఇష్టమా! అని కాదు."

"మరి ఇంకేం చేస్తాను. ఓ వందరూపాయలు రాక పోతుందా?"

"నీ ఇష్టం భానూ. ఇందులో నా ఇష్టాఇష్టాల ప్రమేయం లేదు. నీ ఇష్టమే" అన్నాను.

భాను సంపాదనమీద బ్రతుకదామని కాదు, అది అయిష్టమూ...కాదేమోకూడా...కాని, ఏమిటో బ్రతుకు.... జీవితం...సంసారం.

భాను ఉద్యోగంలో చేరింది.

మామూలుగానే సాగిపోతోంది సంసారం.

మొదటి నెల సంపాదన తెచ్చింది భాను. ఆ రోజు ఇద్దరి జీతాలు కలిపి లెక్క పెట్టుకున్నాం. రెండు వందల యాభై. బావుంది. ఇక ఫరవాలేదు.

"ఇంక మన కష్టాలు గట్టెక్కినట్టే" అని బరువుగా ఊపిరి తీసుకుంది భాను. మగతగా వెళ్ళి లైటు తీసి వేసింది.

ఆ రేయి, తొలిరేయినాటి భానుమతి నా ముందు ప్రత్యక్షమైంది. కొత్త వరాలిచ్చింది. కొత్త పరిమళాలు వెద జల్లింది. వలపు గుబాళి పుతో మైమరపించింది. ఉక్కిరి బిక్కిరి చేసింది.

"భానూ, నువ్వు నిజంగా స్వర్గం అంచులనుండి..." ఏదో అనబోయాను.

"సరిలెండి ఆపండి" అంటూ నోరు నొక్కింది పల్చటి తీయని పెదాలతో. చంద్రుడు మాయమైనాడు, తొలి కోడి కూసింది.

"నా భాను నిజంగా......"

"మీరు మాత్రం."

తీయని ఊహల బరువు, అనుభవాల మత్తు, కంటిలో తేనె సోనలు, ఇంకా పూర్తిగా పోలేదు. తెల్లవారింది.

* * * *

"ఈ చీర బావుందా?" భాను గొంతు. కొత్త చీర సింగారించుకునివచ్చి మంచంమీద వారగా కూర్చున్నది.

"బాగానే వుంది. ఎప్పుడు కొన్నావ్?"

"నిన్ననే. జీతం వచ్చిందిగా, ఓ యాభై పెట్టి కొన్నాను."

"అయితే నీ జీతం నూటయాభై అన్నమాట!"

"అవును, మొదట వందే అన్నారు, మా బాస్ పెంచారట నాకూ తెలీదూ నిన్నటి వరకూ. పేమెంటు చూచి నేనే ఆశ్చర్య పోయాను."

"అలాగా, అయితే అప్పుడే మీ బాస్ దృష్టిలో పడ్డావన్నమాట మంచిది."

"అంటే మీ ఉద్దేశం"

"ఏం లేదు, బావుంది, చీర రంగు చాలా బావుంది. వెలుస్తుందేమో రంగు. మరి ఆఫీసు టైం అయింది. వెళ్ళిరా, డియరియో" అన్నాను.

ఓ ముద్దు పెట్టి వెళ్ళి పోయింది భాను.

ఆడవాళ్ళకు చీరలంటే ఎంత మోజు. నాకై నేను భానుమతికి ఏమీ కొనకపోయినా, కొనలేకపోయినా, తన సంపాదనతో కొనుక్కుంటే నాకేం బాధ, మనస్సు నిలద్రొక్కుకోవాలి, తప్పదు. అయినా భాను నాభార్య; ప్రేమించి పెళ్ళి చేసుకున్నాం.

మరో రోజు సాయంత్రం ఇంటికి వచ్చే సరికే అద్దం ముందు నిలబడి అలంకరించు కుంటోంది. మెడలో కొత్త నెక్లెస్ మెరుస్తోంది.

"కొన్నావా భానూ" అడిగాను నవ్వుతూ.

"బావుందా ?" అన్నది గర్వంగా చూస్తూ.

"బ్రహ్మాండంగా ఉంది. ఇప్పుడు చాలా అందంగా ఉన్నావ్."

"కాలీగ్స్ అంతా కొంటుంటే నేనూ కొన్నాను. వాయిదాల పద్ధతిలో బాకీ చెల్లించవచ్చు."

"పోనీలే"

"ఏమండీ"

"ఏమిటి భానూ ?"

"ఇవి మీకోసం తెచ్చాను. చూడండి. నచ్చుతాయేమో"

పాకెట్ విప్పాను. టెరిలిన్ పాంట్సు, అమెరికన్ స్లాకులు.

"ఏమి టివన్నీ ?"

"మీ కోసమే. ఎప్పుడూ ఆ చిరిగిపోయిన బట్టలు వేసుకు తిరుగుతుంటే ఏం బావుంటుంది చెప్పండి. సరదాగా షికారుకు వెళ్ళాలన్నా, పిక్చరుకు పోవాలన్నా మంచి బట్టలే లేవాయె మీకు."

"నాకు లేకుంటే నీకు నామోషియా."

"కాదేమిటి. నా కొలీగ్స్ చూచి, మీ హబ్బీయూ అంటే ఏం చెప్పాలి ?"

"ఏం అవునంటే తప్పా !"

"తప్పని కాదు. ఫాషన్‌గా ఉంటే ఏం."

"నా కిష్టం లేదు భానూ ఇవన్నీ."

"నో డియర్. నీవలా అనకూడదు. మా సుజాతా వాళ్ళాయన ఏం చక్కగా స్కూటర్ మీద పోతుంటే ఎంత ముచ్చటగానో ఉంటుంది. చూడ బుద్ధేస్తుంది. అలానే మనం కూడా."

"అంటే నీ ఉద్దేశం."

"మనం కూడా ఓ స్కూటర్ కొందాం."

"ఇంకా నయం. కాడిలాక్ కారు కొందామన్నావు కావు."

"అంటే మాత్రం తప్పా. ఆ రోజు వస్తుందేమో, కొంటావేమో."

"కను కను, కలలు కను."

"అవేగా మిగిలాయి ఈ బ్రతుక్కు."

భానుమతి నిజంగానే చాలా మారిపోయింది. కొత్త కొత్త ఫర్నిచర్ కొన్నది. బీరువాలలో నూరు చీరలవరకూ ఉన్నాయి. ఎన్ని రకాలో నగలు, ఇరవై రకాల చెప్పుల జతలున్నాయి. ఏ చీర రంగుకు ఆ రంగు చెప్పులు తొడుగుతుంట. ఏమిటో వెర్రి.

ఓ రోజు భానుని అడిగాను—

"నీ ఆడంబరాలు చూస్తుంటే నాకు భయంగా ఉంది భానూ."

"ఏం అనూయూ! చీకిలిచుండలాగా ఉంటే భయం ఉండదా..." అన్నది.

"అదేమిటి భాను నీకేం తక్కువని, అందం ఉంది, చదువుంది ... ఉద్యోగం ..."

"అవి చాలవు లెండి. వాటిని చూచేవారు చేసేవారు లేకుంటే ఎందుకు అందం, తగలెయ్యనా ?"

"నన్ను క్షమించు భానూ" అన్నాను. కళ్ళలో అప్రయత్నంగా నీళ్ళు తిరిగాయి.

"ఒక్కమాట అడుగుతాను కోప్పడకుండా చెప్పండి. మీరు ఉద్యోగం మానెయ్యకూడదూ. మీ ఆరోగ్యం బాగాలేదు. చాలా చిక్కిపోయారు. నాకు వెయ్యి రూపాయలు వస్తున్నాయి. అవి చాలవూ మనకు."

తల దిమ్మెక్కింది. మనసు బరువైంది.

"మానేసి ఏం చేయమంటావు?"

"ఎందుకూ ఎదుగు బొదుగూలేని ఉద్యోగం. ఎన్నాళ్లు చేసినా గొర్రెతోక జీతమే గదా! నేను చూడండి సంవత్సరం తిరిగేలోగా వంద నుండి వెయ్యి రూపాయలు సంపాదిస్తున్నాను. ఇంచక్కా" అన్నది. ఆమె కళ్లలో గర్వం తొంగిచూచింది.

"అవును. రేపు కారుకూడా కొంటావ్ నీకేం."

"కొంటాను. మా బాస్‌కి . . ."

"భానూ" కోపంగానే అరిచాను. ఎప్పుడూ రానంత కోపం వచ్చింది. నరాలు పట్టుతప్పాయేమో.

భాను తెల్లపోయింది.

"భానూ నువ్వే ఉద్యోగం మానెయ్యి భానూ! మానసికంగా నేను నరకం అనుభవిస్తున్నాను" అన్నాను.

"నేను సుఖపడటం మీ కిష్టం లేదా?" అన్నది.

"నాకయిష్టమా! ఎంత మాటన్నావు భానూ, నువ్వు సుఖపడటం నా కిష్టంలేదానా అన్నావు. అయ్యో భానూ... నిన్ను...ఎంతగా..."

"ఆపండి, ఈ కబుర్లకేం. పైగా నన్ను ప్రేమించా నంటారు. నన్ను నిజంగా ప్రేమిస్తే ఆ నాకు ఉద్యోగంలో చేరతా నన్నప్పుడే నాలుగు బాది నోరు మూయించి ఉండే వారు. తొలి జీతంతో చీర కొన్నప్పుడే నగలు కొన్నప్పుడే మందలించేవారు. ఆ నాడే ఉద్యోగం మాన్పిస్తే సంతోషించే దాన్ని. ఇప్పుడు మీరు ఎంత చెప్పినా నేను మానలేను. మానుకోలేను;అన్నిటికీఅలవాటైపోయాను. మీరు నాకు కా నాకు భర్త అంతే. నా ఇష్టాలకు నా సుఖాలకు అడ్డురాకండి" అంటూ విసవిసా వెళ్ళిపోయింది.

"భానూ! నీవు స్త్రీవి, చదువుకొన్న స్త్రీవి. కోరిక లున్న కోమలివి. మగడున్న మగనాలివి. నువ్వు నువ్వే. నిన్ను ప్రేమిస్తున్నానా? ఖర్మ ఏమో! నీవు నన్ను ప్రేమిస్తున్నావా ... స్త్రీ ప్రేమించదు. ఆ విషయం బహుశా నీకు తెలీదు, నాకు తెలుసు."

* * * *

చీకట్లు విరబూచాయి. భాను రాలేదింకా, ఆకలి వేయటం లేదు. మనసు చికాకుగా ఉంది. పిచ్చెక్కినట్లయింది. బుర్ర పనిచేయటం లేదు. అలా బజారు వెడదామని బయలు దేరాను.

తలుపు తీశాను ఎదురుగా ... ఎవరూ?

"నువ్వా లక్ష్మి!"

"అవును బాబూ ... మాలను, మరచి పోయారా? అమ్మగారు లేరా..."

"ఉన్నది లక్ష్మి...ఉన్నది." కన్నీరు చిలికింది. గుండె గొంతుకలో వెలక్కాయ పడ్డది.

"ఆదేం బాబూ—అలాగున్నారు."

"ఏం లేదులే లక్ష్మి. నువ్వు బాగున్నావా?..."

"నాకేం బాబూ. బాగానే వున్నా." అన్నది తన అందం ఓసారి చూచుకుని.

అవును. ఆ పలపు పుంకరింత ఇంకా తగ్గలేదు. ఆ పొంకం ఇంకా అలానే వుంది. ఆ కళ్ళలో దీపాల వెలుగు పోలేదు.

"లక్ష్మి! ఓమాట అడగనా?"

"అడగండి బాబూ"

"ఓసారి నన్ను అడిగావు జ్ఞాపకం ఉందా."

"......"

"ఏమండీ...నన్ను ప్రేమించరూ అని."

సిగ్గు పడ్డది. చిలిపి బాధ అయింది.

"మీకు మా బాగా జ్ఞాపకం బాబూ...ఏమిటోలెండి. అప్పుడంటే మీరంటే మనసైంది. అందుకే అట్లా అడిగా..."

"ఇప్పుడు కాదా?"

"ఏం మనసు బాబూ ... మనసులు, మమతలు, బెమతలు...ఏముంది ఉత్తి కోరికలేగా..."

"అదేం లక్ష్మి.. నువ్వు ఇంకా..."

"ఆఁ చెప్పండి బాబూ. మీ అభిమానమేగాని, ఆకలి తీరాక అమృతం దొరికినా ఏం ప్రయోజనం."

"లక్ష్మి నువ్వు..."

"నేనే కాదు బాబూ, అందరం అంతే. ఏదో వెర్రి బెమత. నేనంటే మీకు మనసున్నాది; అదే చాలు. ఈ జన్మలో కాకపోయినా, వచ్చే జన్మలో అయినా మీ ఇంటి దానిగా పుడతా"

అంటూ కన్నీ రొత్తుకుంది.

లక్ష్మి మనసు ఆ కన్నీటి పొర వెనక దాగున్న విషయం నాకు తెలుసు. దాని గుండెల్లో కరుడుగట్టిన వలపు, మమత, ఎంతటి ఉన్నతమైందో, పవిత్రమైందో, ఈ జీవితంలో మరచి పోవటం జరగదు.

ఇప్పటికీ, ఎప్పటికీ నా కళ్ళల్లో కనిపించి 'ఏమండీ, నన్ను ప్రేమించరూ' అని అడుగుతూ ఉంటుంది. ఏమని సమాధానం చెప్పను, సమాధానం భానుమతిని అడగమంటే!?



# పునరపి జననం

కెవ్వుమన్నది నిశి.

నిశి ఒడిలో ఆదమరచి నిద్రిస్తున్న సుశి గతుక్కుమన్నది.

భయంతో బరువెక్కిన కళ్ళు తెరిచింది. చుట్టూ అంతా అంధకారం...తనలో...బెడ్ లైటు వెలుగు ఎర్రగా, శుక్రునిలా దూరంగా చీకటిలో కాపురు మంటోంది. అందని తీరాల్లో, అద్దరిని, అందరికీ అందుబాటులో ఉన్నట్లే, తిండి లేనట్లే, వెలుగు లేనట్లే, తెను కానట్లే చూస్తుంది శుక్రతారక అనంత రోదసినుండి, ఆవరించిన చీకటిలోకి.

భారంగా లేచికూర్చుంది. గుండె అదురుతోంది. నుదురు చెమటతో తడిసిపోయింది. నిర్భీతిని మింగే భీతి, ప్రపంచాన్ని మింగే అణువు, ఆత్మనిమింగే జ్యోతి, అది ఇది అంతరాత్మకే సాక్షి. అంతర్ముఖం అయినవారికే ఎరుక.

కొన్నిక్షణాలు, నిమిషాలు, తనవికాకుండా, తనకు తెలీకుండా చీకటిలోకి జారి కరిగిపొయ్యే వెలుగురేకుల బాకుల్లా జారిపోతున్నాయి. తనెవరో తనకు తెలుసు. తెలీని అజ్ఞానంలేదు. అదీ గతంలోంచి, ప్రస్తుతానికి సరిహద్దు. స్వాప్నికస్థితినుండి జాగృతిలోకి కనుబాట వహారా.

చీకటి గుహాలో జీవించే మానిసి వెలుగురేక సోకగానే తృళ్ళిపడినట్లు, ఒక్కసారిగా గదిలో పరచుకున్న కాంతి వెన్నెలకు తబ్బిబ్బై తొట్రుపడింది.

"ఏమిటి సుశీలా! కలవరించావా?" స్విచ్ మీది వ్రేలు తీస్తూ ఆత్రుతగా ప్రశ్నించాడు కాముడు, ఉరఫ్ కామేశ్వర్రావు. అతను అందరికీ కాముడు కాదు. అవునో కాదో అయినా కొందరికి అంతగా తెలీదు, అనటం తప్ప. ముద్దుగా ముచ్చట పడటం తప్ప అసలు పేరు కామేశ్వర రావు. కాలేజీలో చేరిన నాలుగు రోజులలోనే కామేశంగా మిత్రులనోళ్ళలో నానాడు. మిస్టర్ కామ్‌ంగా అమ్మాయిల పెదాలపై లాస్యంచేశాడు. ఏమైనా అతను కాముడే!

అందానికి అందం, చూడచక్కని అలంకారం, నలుగురు మెచ్చే తెలివి, అమ్మాయిల్ని ఆకర్షించే యోగ్యత, పైగా అన్నిటినీ మించిన చలాకీతనం, ఎన్నో అతన్ని ఆకాశాని కెత్తాయి. అందుకే అతివల నందుకోవాలని ఆత్రుతపడే అబ్బాయిలు కామేశం స్నేహితులు, హితులు అయినారు. నిజంగా అందంగాఉండే అమ్మాయిలు అతని చూపుదాటి పోలేదు. పరిచయం కలిగించుకోకుండానూ ఉండలేదు.

వాళ్ళందరినీ కామేశం శక్తి వంచనలేకుండా ప్రేమించాడు. కాని ఎవర్నీ వాంఛించలేదు. మోహించలేదు. మన సిచ్చాడుగాని, మరులు గొనలేదు. ఔనంటే ఆలింగన సౌఖ్యం దొరక్క పోయేదికాదు. అతివల గులాబి రేకుల పెదాలు దూరంకాదు. అభ్యంతరాలు ఉండికాదు కానీ మనసు... దానిలో చిగురించిన ఆవేదన. ఏదో కాదని, అందనిదేదో అత్యుత్తమమైంది ఉన్నదనీ, అజ్ఞాత వాంఛ అతణ్ని ఇంచుక ప్రవరుణ్ని చేశాయి అప్పట్లో.

"ఏమయ్యా! కామయ్యా! నీ అందానికి నీ తెలివి తేటలకు మేం సరిపోమా?" అని తెగించి నిలబెట్టి, వలపన్నే వయ్యారి తట స్థపడలేదు. పడితే ఎలా వుండేదో! ఏమయ్యేదో! అందుకే, ఏదీ పొందని కారణంగానే కాముడు కవి అయ్యాడు. తనవైపు వీచే వలపు గుబాళింపులు కలంతో నింపుతున్నాడు. తనపరంగా, తనను వలచిన వారి పరంగా, మేలిమి మంది రాలు నిర్మించి, కమ్మని కథలు వ్రాసి, కైతలు ఆలపించాడు. అదే కాలాన్ని మ్రింగింది. అందరినీ దూరంచేసింది. స్త్రీ ప్రేమకు హద్దు లెక్కువ. స్త్రీ హృదయానికి చిల్లు లెక్కువ. మన సుకు మమత లెక్కువ. ఎక్కడికక్కడే ఓ సరిహద్దు క్షణం జరిగితే, కాలం కాటు వేస్తే, స్త్రీ ఎవరో? ఏమౌతుందో, ఎవరిదౌతుందో? ఎవరికి హృదయంలో చోటిస్తుందో, ఎవరి హృదయంలోకి దూరుతుందో స్త్రీకే తెలీదు.

పెళ్ళికాని పిల్లలు. అందునా కాలేజి కన్నెలు. ఏ క్షణంలో ఎవరి అదృష్టంలో వాలుతారో తెలీదు. అని తెలిసే, వారిపైన కామేశం చూపులు వాలలేదు. వాల్చూ పుల కోసం వెదకలేదు. వెర్రివాడు కాలేదు. వయ్యారి భామ లకై వేట ప్రారంభించనూ లేదు. వలచి వచ్చిన వారినే వలదు పొమ్మన్నాడు.

అందుకే కామేశం పిరికివాడైనాడు. 'కామం' కంట్రోలు చేసుకొని, చదువు పూర్తి చేసుకుని ఓ ఇంటివాడైనాడు. అక్కడే లెక్చరరుగా చేరాడు.

పెండ్లి కాకముందు సుశీలను ఎరగడు. ఆమెను, అంద రిలా ప్రేమించలేదు. పెండ్లి చూపుల కని చూడనే లేదు. విధిపై భారంవేసి పెద్దవాళ్ళు చూదిన సంబంధం, తను చూడ కుండానే సరేనన్నాడు. ప్రేమ, గీమా ట్రాష్ అన్నాడు.

అయితేనేం సుశీల బ్రహ్మాండాన్ని బద్దలు చేయగల అందగత్తె కాదు. సంసార పక్షంగా ఉండే అందం. నాజూకు తనం - అతి నయగారాలు పోని నాజూకుతనం. ఒబ్బిడిగా తను, భర్త, ఇల్లు, వాకిలి, ప్రేమ...అవే కామేశం కూడ భార్యలో ఉండాలని కోరుకున్నది. నాలుగు ఇంగ్లీషు ముక్కలు నేర్చిస్తే, అప్సరసల్లా సుఖపెడతారని భ్రమపడలేదు. ఇంగ్లీషు చదువుకున్న ఆడాళ్ళని చేసుకున్న వాళ్ళపాట్లు చూచాడు. తెలిసీ ఆ గోతిలో దిగటం ఇష్టంలేదు. చదువుకున్న అమ్మా యిల్ని నమ్మటం ఎలా?

తను ఎంతగా మనసిచ్చాడో, సుశీల అంతకంటే భద్రంగా ఇచ్చింది. ఎంత పవిత్రంగా ప్రేమించాడో, అంత పవిత్రంగానే సుశీల ప్రేమిస్తో వుంది. అది మాంగళ్యం తంతులోనే ఉన్న దేమో! మెడలో మాంగళ్యం కట్టే టప్పుడే సుశీలా, అగ్ని హోత్రుని ఎదుటగా ఆమెను చూచాడు. పోతే నాటి రేయి రతీదేవిలా సాక్షాత్కరించి నపుడు మనసా వాదా కాంతు డైనాడు. అంత అందం, అంత పొంకం, అంత సౌకుమార్యం ఉంటాయా స్త్రీలో అని చెక్కిలికి చేయిచేర్చి, చెలిని చేర దీశాడు.

అనుకోకపోయినా, ఆశించకపోయినా వరప్రసాది కామే శం. పూవు వంటి హృదయంలో భద్రపరచి రహస్యంగా అర్చించాను, ఆరాధించాను. పురుషుని ఆరాధన ఎప్పుడూ స్త్రీకి తెలియదు.

*                    *                    *                    *

సుశీల ఈ క్షణంలో పూర్ణ యామిని. తనలో మరో కామేశానికీ, సుశీలకీ చోటిచ్చి పెంచుకుంటున్నది. పక్షపాతం లేకుంటే, మరో పక్షం రోజుల్లో, అమ్మ అవుతుంది.

"ఏమిటి సుశీ! అలా బెదిరిపోతున్నావ్! ఏం కల వచ్చిందా! ఏం కల చెప్పవూ?" అంటూ కామేశం లేచి సుశీ మంచంపైకి వచ్చి కూర్చుని వొళ్ళోకి తీసుకున్నాడు.

ఆతని కళ్ళలోకి చూస్తూ, జుట్టులోకి వేళ్ళు పోనిచ్చి, మెడపై చేయివేసి, నెమ్మదిగా తనపైకి వంచి, పెదాలు అందించింది.

అది అమృతంతో నిండిన సువర్ణ పాత్ర. ఆ విషయం కాముడికి తెలుసు, దాని అంతర్యమూ తెలుసు.

"ఏమిటి సుశీ?" అన్నాడు.

"మీరు నన్ను ప్రేమిస్తున్నారు కదూ?"

"ఏమిటీ ప్రశ్న?"

"కాదు లెండి. నిజం చెప్పండి. మనస్సాక్షిగా."

"ఊఁ" అని చూశాను సుశీ కళ్ళల్లోకి సాలోచనగా కారణం కోసం వెదుకుతూ. ఆ కళ్ళ లోతుల్లో ఎక్కడో దాగిన అగాధాలు.

"పూర్వ జన్మలో మనం ఎవరమో?" అన్నది వేదాంతిలా ...

"మనం మనమే. మనం ఒక్కటే. ఇద్దరం కాదు." అంటూ కౌగిలిలోకి తీసుకున్నాడు.

"వచ్చే జన్మలోనో?"

"అదీ అంతే సుశీ" అంటూ పెదాలపై ముద్దు పెట్టుకున్నాడు.

సుశీల అతని చేతుల్లో మొహం దాచుకుంది. వెక్కి వెక్కి ఏడ్చింది.

దానికి కారణం అర్థం కాలేదు కామేశానికి.

"సంగతేమిటి సుశీ?"

"ఏమి లేదండీ ... ఏదో కల వచ్చింది. భయంవేసింది. అంతే. మీరు...మీరు ఉన్నారు. నాకేం కావాలి."

"ఏమిటీ ఈ అర్థంలేని మాటలు."

"పోనీ లెండి పడుకోండి. మీ నిద్ర పాడుచేశాను." అంటూ లైటు ఆర్పివేసింది.

రాత్రి యుగం తర్వాత తెల్లవారింది.

*          *          *          *

సుశి పుట్టింటికి వెళ్ళింది. వెళ్ళి వారం గడిచిపోయింది. వెళ్ళడానికి ఇష్టం లేదు. కామేశాన్ని ఒంటరిగా వదలటం అంటే ఏదో వియోగం. ఈ జీవితంలో మరలా కలుసుకోలేమేమో అన్నంత దుఃఖంలోనే దూరమైంది. కామేశం అమాయకుడు సుశి దృష్టిలో. మరీ ఏమీ తెలియనివాడు. ఆయన

చేసుకోవలసిన పనులలో కూడ తానే సాయం చేయవలసి వచ్చేది. పాపం, ఎలా ఉంటారో ఏమో ?

వచ్చేముందే అనుకున్నది. భగవంతుడు చల్లగాచూస్తే ఓ నెల తిరగకుండానే తిరిగి వచ్చేస్తాను. ఇంకెప్పుడూ స్వామికి దూరం కాను అని. ఏమో, భగవంతుడు. అయితే ఆ కల ? భగవంతు డుంటే, ఆ కల నిజమవుతుందా! నిజమైతేనే భగవంతుడు ఉన్నట్లా ? అగమ్యం. నిజానికి నీడలే కలలు అంటారే! మరి ఇదేమిటి ? కలను వ్యాఖ్యానించటం కలవరించటంతో సమానం. కొందరి విషయంలో కలలు నిజమవుతాయట. కొందరికి నిజాలే కలలవుతాయి. తన పట్ల! ఏమో విధి ?

కామేశం......ఏమిటీ, ఏదో నల్లని ముసుగు చీకటి ఆవరించింది కలలో. తనకు భయంవేసింది.

ఆ తర్వాత ఆయన కనిపించలేదు తనను కనికరించనూ లేదు. ఏదో వెలుగులోకి పయనించింది చీకటినీడ. చీకటి ముసురుకుని, అందులోంచి ఓ వెలుగుకిరణం ఆకాశంలోకి దూసుకుపోయింది. అర్థం అంతు చిక్కుటంకాదు. అదే తన మనస్సును వ్యధిస్తోంది. ఎంతప్రయత్నించినా మరువలేక పోయింది.

ఈ వారంలో పది ఉత్తరాలు వ్రాసింది. సాయంత్రం పోస్టులో వ్రాసినా, అర్ధరాత్రి ఏమీతోచక వ్రాస్తూ కూర్చునేది. ఒక్కొకరోజు తెల్లవారేది అలాగే, తొలిరేల అనుభవాలు. జీవిత ఉషస్సులోని వెలుగురేకలు ఎన్ని ప్రోగు చేసినా ఇంకా మిగిలేవుండేవి. అవి ప్రేమలేఖలా, ప్రణయ

లేఖలా...ఏమో హృదయాలకే ఎరుక. సుశీల స్థిమితంగా లేదు. లేకపోవడానికి ఈ మధ్య ఎన్నడూ లేని వియోగం, సంయోగంలోని మరువలేని అనుభూతి. క్రొంగొత్త రుచులు జీవితంలో ఎప్పటికప్పుడు. ఏరోజు కారోజు ఏ క్షణాని కాక్షణం కొత్తగా, సరికొత్తగా రూపందే, రుచించే అనుభవం.

క్లాసునుండి వచ్చేసరికి సుశీల వ్రాసిన ఉత్తరం ఎదురుగ బల్లమీద ఉన్నది. ఆత్రంగా చదివి, అలసిన మనస్సుతో, ఆలోచనల బరువుతో అలా కళ్ళుమూసుకున్నాడు కామేశం. చేతిలోని ఉత్తరం గుండెలమీద గుబగుబలాడుతోంది. జలజ వచ్చిన విషయం తెలియదు. ఉత్తరం లాక్కున్నది. ఉలిక్కి పడి కళ్ళు తెరిచాడు.

"ఓ! మీరా?"

"ఏమిటి మాస్టారూ పగటికలలు?"

"అది ఇటివ్వు జూలూ!"

"ఉహుఁ ఇవ్వను. ఏం చదవకూడదా?"

"ఉహుఁ."

"ప్రేమాలేఖా?"

"అవును."

"అక్క వ్రాసిందా?"

"వల్లకాటి వెంకటమ్మ వ్రాసింది. నీ కెందుకు ఇమ్మంటే ఆరాలు."

"ఒక్క మాట ఇస్తే యిస్తా?"

"ఊ. చెప్పు."

"ఈ రోజు నాతో రావాలి పిక్నిక్ పోదాం. ఇంట్లో అక్క లేదుగా...అభ్యంతరం కూడా ఉండదు."

"రాను."

"అయితే ఇవ్వను, చదివేస్తా."

"నీకు పుణ్యముంటుందిగాని చదవకు...వస్తాగా."

ఇచ్చింది.

జలజ కామేశాన్ని ఆరాధించిన కొందరిలో మిగిలిన వారికి ప్రతినిధి. అందరూ ఏమైనారో తెలీదు. కొందరు సంసారాల్లో పడ్డారు. కొందరు ఉద్యోగాల్లో చేరారు. వెదుక్కుంటూ, వెన్నంటి వచ్చిందా అన్నట్లు నాలుగేళ్లకు అదే కాలేజీకి లెక్చరర్‌గా వచ్చింది జలజ. అప్పటికే పరిస్థితి చేయిజారి చాల దూరం పోయింది.

జలజది అదే ఊరు. కలవారి బిడ్డ. ఆమె తండ్రి ఏదో పెద్ద ఉద్యోగం చేసి రిటైరైనాడు. ఉన్నది పెద్ద మేడ. హోదా గల కారు. నౌకర్లు, అట్టహాసం, ఆడంబరంగానే ఉన్నది! బాగా ఆస్థి ఉన్నదంటారు. ఇంకా పెళ్ళికాలేదు.

"పెళ్ళి ఎప్పుడు జూలూ" అంటే —

"మీ వంటి మొగుడు దొరికినప్పుడు" అంటుంది సిగ్గు, అభిమానం లేకుండా.

జలజ పిక్నిక్ అంటే కామే [illegible] బుజాలు తడుముకోలేదు. తన మీద తనకు నమ్మకం ఉన్న [illegible] పైన గౌరవం ఉన్నది. అందుకే సరేనన్నాడు. కా [illegible] "జూలూ" ఊరుకోదు మంచిది పాపం!

* * * *

నెలలు నిండి నేడో రేపో అనే స్థితిలో ఉన్న సుశీలకు ఆ వార్త చెప్పటమో, మానటమో అర్థం కాలేదు నారాయణయ్య దంపతులకు. ఎవరికి వారు మౌనంగా ఉండటం, ఇల్లంతా తుపాను వదలిన ప్రకృతిలా నానా భీభత్సంగా ఉండటం. ఏమని? ఏం జరిగినదని ... సుశీలకు అంతు చిక్క లేదు. సుందరమ్మ చీర కొంగుతో కళ్ళు తుడుచుకోవటం, చాటుగా, మాటుగా వచ్చే ఏడ్పు ఉగ్గ పట్టుకోవటం జరుగు తున్నది. నారాయణయ్య మళ్ళీ కనిపించలేదు. సుశీలకు ఏదో అనుమానం కలిగింది. ఈ వైముఖ్యానికి హేతువు?

సుశీల ఈ స్తబ్ధ వాతావరణాన్ని భరించలేక పోయింది. మనస్సు ఆదోళా అయింది. అసలు వచ్చిన దగ్గర నుండి అలానే, పిచ్చిగా వికారంగా ఉంటున్నది. ఈ నాలుగురోజులూ వారు వచ్చి ఇక్కడే వుంటే బాగుండునని, రమ్మని వ్రాసింది. ఇంకా రాలేదు. వస్తారని తన ఆశ చెబుతున్నది. ఒకవేళ రానని వ్రాశారేమో! అందేనేమో! వస్తే తనకే వస్తుంది ఉత్తరం. నాన్నగారి పేర ఏ ప్రత్యుత్తరం రాదు.

అనుమానం వచ్చి, తండ్రి గదిలోకి వెళ్ళి, బీరువా, టేబిలు వెదికింది. మంచంపైన దిండుక్రింద దొరికింది వుత్తరం.

చదివింది. చేతులు వణికాయి. ఏమీ అర్థంకాక కాదు నమ్మలేక. నిజమేనా? మళ్ళీ కన్నీటి పొరలు తొలగించు కుంటూ చదివింది.

శ్రీ నారాయణగార్కి—

మీ అల్లుడు శ్రీ కామేశ్వరరావు మొన్న పిక్నిక్ కని వెళ్ళి ప్రమాదవశాత్తు కారు, కొండ లోయలోకి దొర్లడంవల్ల మరణించాడు. —ప్రిన్సిపాల్

గుండె ఆగిపోయింది. మనిషి కుప్పలా కూలిపోయింది. స్పృహ తప్పింది. ఆ తర్వాత ఏమో తెలీదు. ఏమైందో తెలీదు సుశీలకు.

సుశీల మేడపైకి వెళ్ళి, తిరిగి రాకపోవడంతో సుందరమ్మ ఆదరా బాదరాగా పైకి వెళ్ళింది. అనుకున్నంతా అయింది. సుశీల మూలుగుతోంది. లేడీడాక్టరు, నర్సుకు కబురు చేసింది.

* * * *

అచేతన స్థితిలోనే సుశీల మగబిడ్డను కన్నది. డాక్టరమ్మలకు అంతు చిక్కలేదు. మూసిన కన్ను తెరవకుండా పడి ఉన్న సుశీల ప్రసవం వైద్యశాస్త్రంలో కొత్త ప్రక్రియకు దోహదం చేసింది

సుందరమ్మ ఆదుర్దా చెప్పనలవికాదు. అసలు తన బిడ్డ బ్రతికి వుందో లేదో ఆమెకే అనుమానం. డాక్టర్లకు అనుమానం లేదు. కానీ అంతు చిక్కలేదు. నారాయణయ్య ఊళ్ళోని పెద్ద డాక్టర్ల నందరినీ పిలిపించాడు.

సుశీల కళ్ళు విప్పి చూచేసరికి ప్రక్కనే పసిబిడ్డ. చుట్టు డాక్టర్లు, బంధువులు, స్నేహితులు, ఎందరో కళ్ళల్లో జ్యోతులు వెలిగించుకుని చూస్తున్నారు.

"అమ్మా!" అన్నది బాధగా.

"ఏడుకొండలవాడా! నా బిడ్డ బ్రతికిందిరా నాయనా!" అని చేతులెత్తి ఆకాశానికి నమస్కరించింది సుందరమ్మ. డాక్టరమ్మ మొహంపై వెయ్యి కాండిల్సు బల్బు వెలిగింది.

జరిగింది తెలుసుకుని సుశీల ఆశ్చర్యపోయింది. తాను ప్రసవించిందా! మగబిడ్డను కన్నదా! ఎంత ఆశ్చర్యం! ఏదీ ఆ అనుభూతి. మరొక ప్రాణికి జీవం ఇచ్చే క్షణంలో కలిగే ఆనందం...బాధతో మిళితమైన సంతోషం తనకు తెలీదే! తాను ఏమైంది...

తన ప్రియునితో విహారం చేసింది.

ఛీ...ఎంత విడ్డూరం.

ప్రక్కనే పసివాడు. ముమ్మూర్తులా ఆయన పోలికే. ఆ చిలిపి కళ్లు...ఆ బుగ్గలు, అదే పోలిక. చేతులు మూసి, ఎంత హాయిగా నిద్రపోతున్నాడు. ఆయనా అంతే. నిద్ర పోతుంటే చూడాలి. పసివాడుగా మునగదీసుకుని, కాళ్ళు పొట్టలో పెట్టుకుని, చేతులు ముడిచి, తల్లి కడుపులో ఒదిగిన పసివాడుగా పడుకుంటారు. ఎంత చిత్రం ... తండ్రి కొడుకు, తను తల్లి.

తండ్రి! ఏడీ ఆ తండ్రి? ఏమైనాడు. నీకు నా కొడుకు అని చెప్పుకుని సంతోషించే అవకాశం లేకుండా, విధికి బలియై వెళ్ళిపోయారు. గంభీరంగా పడుకున్నది సుశీల...మగత నిద్ర నిద్రలోకి దింపింది.

"సుశీలా!"

"ఎవరూ" నిద్రపోతున్న సుశీల లేచింది. గది అంతా చీకటి.

"నేను సుశీలా... నేనే"

"మీరా...వచ్చారా....మీరు బ్రతికే ఉన్నారా! చనిపోలేదూ. ఆప్రిన్సిపాలు అలా వ్రాశాడేం చెప్మా. అయ్యో రండి." కలలోనే లేచి ఆహ్వానించింది.

"సుశీలా...నేను చనిపోతానా సుశీలా. నిన్ను వదలి వెళ్ళగలనా. నేను లేకుండా నీవు ఉండలేవుగా. మనం ఆనాడు ఏమని ప్రమాణం చేసుకున్నాం. ఎప్పుడూ శాశ్వతంగా కలిసే ఉండాలనికదూ. మనం జన్మజన్మలా దంపతులంకదూ. నేను చనిపోతానా?"

"పోనీలెండి. వచ్చారు అంతేచాలు."

"ఈ అబ్బాయి మన బాబుకదూ. కాముడు అని పేరు పెట్టా. నేనే, నిన్ను వదలిపెట్టలేక నీ కడుపునే పుట్టాను తెలుసా. సుశీలా నేను బాబును. నీ బాబును నేనే తెలుసా?"

"మీరా?"

ఆయన వచ్చారు. వెళ్ళారు.

వెళ్ళలేదు. నా బాబులోకి వచ్చారు.

నా స్వామి నా బాబుగా మారారు.

వారే నా బాబు, నా స్వామి, నా దగ్గరే ఉన్నారు.

అంటూ, అనుకుంటూ చంటివాడి తలపై చెయ్యివేసి గారాబంగా ముద్దుపెట్టుకున్నది.

కాలం సాగిపోతూంది. అనుభవాలు మారుతున్నా, నైరాశ్యం అలుముకున్నా, అలాంటి అనుభూతులు అంతర్యం లోంచి తొలగటంలేదు. నా అన్నవాళ్ళు, కళ్ళలో పెట్టుకునే అమ్మ, నాన్న ఉన్నా, కామేశంలేని లోటు, పోటుగానే ఉన్నది. ఎన్ని వినోదాలు కల్పించుకున్నా, ఆనందాలు ప్రోవు చేసుకున్నా, అనుభూతిలోపమే కదా!

బాబు పెరుగుతున్నకొద్దీ మరీ కామేశం పోలికలు ఎక్కువగా కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నాయి. నారాయణ, సుందరమ్మలు మనవణ్ని వదలి క్షణం ఉండరు. వాళ్ళకు కావలసినవాడు, వారసుడు, అతడే.

తప్పనిసరి జీవితం. బాబునే సర్వస్వం అనుకుంటే తప్ప గుండె రాయికాదు. గతంలోంచి భవిష్యత్తులోకిపయనించటం జరగదు.

బాబును ప్రక్కలో పెట్టుకుని మగతగా మధురానుభూతుల్ని నెమరువేసుకునేది. అమాయకంగా పసివాడు పాలు తాగుతూ అల్లరిచేస్తుంటే కామేశం చేష్టలు జ్ఞాపకానికి వచ్చేవి.

"తప్పు బాబు... నేను అమ్మనుకదూ...మా బాబువి కదూ," అనేది. అని నవ్వుకునేది. పసివాడి కళ్ళల్లోకి చూస్తూ మరచిపోయేది తను.

క్రమేణా కోర్కెలకు గుండెలో సమాధి కట్టింది. జీవితం గొప్ప అధ్యాయం పూర్తయింది. ఉత్తరార్థం మిగిలి ఉన్నది. ఆ రంగు, ఆ రసానుభవం కావాలన్నా రాదు. జీవితమే ఇంద్ర

ధనుస్సు అయితే, మబ్బులు క్రమ్మినకొలదీ, సూర్యాస్తమయం అవుతున్న కొద్దీ కొన్ని రంగులు కలిసిపోతాయి.

వసివాణ్ణి పెంచాలి. పెద్ద చేయాలి.

అదే ఆశయం, అదే జీవిత ధ్యేయం. తల్లిగా వాడిని కన్నందుకు, స్తన్యమిచ్చి పెంచినందుకు తన బాధ్యత అది. తన సర్వశక్తుల్నీ, తన ప్రేమను వానికొరకు త్యాగం చేయాలి తప్పదు. మనిషి జీవించాలి. లేదా యితరుల జీవనం కొరకు ప్రాణ త్యాగం చేసినా మంచిదే. ఇతరులను ఉజ్వలంగా జీవించనీయటంలోనే ఔన్నత్యం ఉన్నది. ప్రపంచంలో వాడికి 'నాన్న' అనే పదం అర్థం కాకపోయినా, 'అమ్మ' కైనా, విస్తృతార్థం చెప్పగలిగితే, నిరూపించగలిగితే ధన్యమే.

* * * *

ఈశ్వరరావులో వయఃపరిణామం వచ్చింది. కాలేజీ చదువుల్లోకి వచ్చాడు.

ఒక రోజున ఈశ్వరుడు ఉత్సాహంతో ఇంటికి వచ్చి తల్లిని కేక వేశాడు. పలక్కపోయేసరికి పూజ గదిలోకి వెళ్ళాడు. సుశీలమ్మ ఏదైనా పని లేనప్పుడల్లా ఆ గదిలో కూర్చుని భాగవతమో, రామాయణమో చదువుకుంటుంది!

"అమ్మా!"

"ఏం బాబూ!"

"అమ్మా రేపు కాలేజి ఫ్రెండ్సు చాలామంది పిక్నిక్ వెళుతున్నారమ్మా. నేనూ వెడతాను."

"పిక్నిక్ !!?"

సుశీలమ్మ మనస్సులో వెయ్యి సమ్మెట పోట్లు, వెయ్యి కోణాలలోంచి చీకట్లు తరుముకొచ్చాయి. బాధగా గతంలోకి తొంగి చూచింది. పిక్నిక్—అదే ఒకసారి తన పాలిటి రక్కసి అయింది. శాశ్వతంగా చీకట్లోకి విసిరి వేసింది. అదే మృత్యువు, అదే శత్రువు. ఆనాడు ఆ పాడు పిక్నిక్‌కు వెళ్ళకుంటే ఆయన ఎలా ఉండేది ? కళ్లు చెమర్చాయి. గొంతుక జీరపోయింది.

"వద్దు బాబూ...పిక్నిక్‌కు నీవు వెళ్లొద్దు నాయనా!" పెద్దగా అరిచింది.

అమ్మ అంత ఉద్రేకం పొందటం ఎరుగని ఈశ్వరుడు ఆశ్చర్యపోయాడు.

"అమ్మా!"

"వద్దు. నా దగ్గర ఆ మాట ఎత్తకు."

"సరేలేమ్మా" అని దిగులు తలపై వేసుకుని బయటకు నడిచాడు.

మరో నిమిషంలో నారాయణయ్య వచ్చాడు.

"ఏమమ్మా! ఈశ్వరుడు ఏదో సరదాగా నలుగురితో కలిసి ఎక్స్‌కర్షన్ వెడతానంటే వద్దన్నావట. వాడు కన్నీళ్లు పెట్టుకుని బేలగా కూర్చున్నాడు. పసివాళ్లు పది చోట్లకు తిరిగి రావాలమ్మా. మన పిల్లలుగదా అని మనం అధికంగా ప్రేమిస్తున్నాంగదా అని, కూపస్థమండూకాలను చేయకూడదు."

"వెళ్లమను నాన్నా, ఏదో ఉద్రేకంలో వద్దన్నాను. నాకేం అభ్యంతరం" అన్నది గుండె దిటవుచేసుకుని.

అన్నదే కాని ఈశ్వరుడు వెళ్ళిన దగ్గరనుండి కన్నీరు మున్నీరుగా ఏడుస్తూనే ఉన్నది. ఏమీ చెయ్య బుద్ధికావటం లేదు.

ఆ రాత్రి నిద్ర పట్టలేదు. తెల్లవార్లూ జాగారం చేసింది. ఏవేవో కలవరించింది. ఆ నాటి రేయి కామేశం ఎన్నిసార్లు జ్ఞాపకం వచ్చాడో లెక్కలేదు.

కన్నతల్లి అనుమానం, నాగుపాము కాటు ఒక్కటే. నాగుకాటు తప్పుతుందేమో కాని, తల్లి చెడు తలిస్తే చెల్లి తీరుతుంది, కర్మవశాత్తు ... ఈశ్వరుడు ప్రయాణం చేస్తున్న బస్సు.—

అదీ పేపరులో పడ్డ వార్త. ఊరంతా గగ్గోలైంది. కాలేజీ విద్యార్థులు ఎక్స్‌కర్షన్‌కు వెడుతుండగా కారు కొండకు గుద్దుకుంది. డ్రైవరు, మరి ఇద్దరు విద్యార్థులు మరణించారు. నలుగురికి బాగా గాయాలు తగిలాయి. ఆస్పత్రిలో చేర్చారు.

పత్రికలో పడ్డ వార్తను నారాయణ చదివి గతుక్కుమన్నాడు.

"అమ్మాయ్ సుశీలమ్మా!" అని పిలిచాడు.

"ఏం నాన్నా?"

"ఇది చూడమ్మా." అని పేపరు వార్త చూపించాడు.

"అలా ఓ సారి ఆస్పత్రివరకు వెళ్ళి వస్తానమ్మా ఎవరో పాపం..."

అంటుండగా బయట ఎవరో వచ్చిన చప్పుడైంది.

కాలేజీ బంట్రోతు సైకిల్ మీద వచ్చాడు.

"ఏమయ్యా" అడిగాడు నారాయణయ్య.

"బాబుగారూ, స్టూడెంటు పిల్లకాయలకు బాగా దెబ్బలు తగిలాయటండీ. ఆస్పత్రిలో చేర్చారు. మీ ఈశ్వరుడు గారు కూడా ఉన్నారు. ప్రిన్సిపాలుగారు చెప్పి రమ్మన్నారు."

సుశీలమ్మ గుల్లు ఎగిరిపోయేలా ఏడ్చింది. నారాయణయ్య స్థితి అంతెగానే ఉన్నది. అయితే వగవాడు కనక తమాయించుకున్నాడు.

"అలా వెళ్ళివద్దాం పదమ్మా"

ఇద్దరూ బయలుదేరి టాక్సీ చేసుకుని గవర్నమెంటు ఆస్పత్రికి చేరుకున్నారు.

స్పెషల్ వార్డులో దెబ్బలు తగిలిన విద్యార్థులు నానా అవస్థలో ఉన్నారు. సుశీలమ్మ ఒక్క చూపులో అందరినీ చూచింది. బాబు ఎక్కడ? తన బాబు ఏడీ?

"ఏడి నాన్నా?"

"అడుగోనమ్మా మన బాబే" అని ఓ బెడ్ వైపు చూపించి అటు నడిచాడు. ముఖం, తల పూర్తిగా కట్లతో నిండిపోయింది. స్పృహ లేదు. ఒళ్ళంతా రక్తం మరకలు.

సుశీలమ్మ భోరున ఏడుస్తూ మంచంపైకి ఉరికింది. అంతలోనే డాక్టరు వచ్చాడు.

"డాక్టరుగారూ! మేం ఈ పేషెంటు తాలూకు."

"ఫరవాలేదు. నో సీరియస్. అయితే ఓ వారం పది రోజులు ఇక్కడే వుండాలి."

ప్రాణం కొంత కుదటబడింది.

ఆ తర్వాత సుశీలమ్మ ఆస్పత్రికి రాలేదు. వచ్చి ఈశ్వరుణ్ణి ఆ స్థితిలో చూడలేదు. అందుకే ఇంట్లో పూజామందిరంలో కూర్చుని కన్నీరు మున్నీరుగా ఏడుస్తూ ప్రమాణం చేసింది బిడ్డ తిరిగి ఇంటికి వచ్చేవరకు అన్నం నీళ్ళు ముట్టనని! భగవంతునికి పరీక్ష.

*　　*　　*　　*

ఆస్పత్రి నుండి విడుదల అయ్యే రోజున నారాయణయ్యే వెళ్ళాడు తీసుకురావటానికి. కొడుకును ఆ స్థితిలో ఆస్పత్రికి వెళ్ళి చూచే మనోధైర్యం లేదు సుశీలమ్మకు.

నారాయణయ్య ఆస్పత్రికి వెళ్ళి అధికారులకు కృతజ్ఞత తెలియజేసి, ఈశ్వరుడి దగ్గరకు వెళ్ళి "బయట కారు సిద్ధంగా ఉంది. ఇంక వెడదాం పద బాబూ" అన్నాడు.

ఈశ్వరుడు అయోమయంగా ఆయన కేసి చూశాడు. ఆయన సంబోధనకు నొచ్చుకున్నట్టు మొహం పెట్టి కండ్లు చికిలించాడు.

"ఏమిట్రా బాబూ అట్లా చూస్తావేం. ఇంటికి వెడదాం పద, అమ్మ నీకోసం ఎదురు చూస్తూవుంటుంది."

"అమ్మా!" ఆశ్చర్యం ఈశ్వరుని వంతైంది.

"అదేమిట్రా బాబూ అలా చూస్తావేం?"

"అసలు మీరెవరండి? మీ యింటికి నేనెందుకు రావాలి? దయచేసి చెప్పండి" అన్నాడు ప్రాధేయపూర్వకంగా.

నారాయణకు అర్థంకాలేదు. వీడికి మతిగాని తప్పలేదు గదా అని అనుమానించాడు.

"నేను నారాయణ తాతయ్యని."

"తాతయ్యా!" పెద్దపెట్టుగా నవ్వాడు ఈశ్వరుడు. "భలేవారండీ తాతగారూ! ఏవూరు మనది...ఏ దేశం... ఈ బాంధవ్యం ఏంటి?"

ఈసారి నారాయణకే పిచ్చెక్కినంతైంది. డాక్టరు దగ్గరకు ఆదరా బాదరాగా పరుగెత్తుకు వెళ్ళి పిలుచుకువచ్చాడు.

"అయ్యా, డాక్టరుగారూ! మా బాబు ఏదో పిచ్చి ధోరణిలో వడ్డాడు. నాకేమో భయంగా వున్నది. కొంచెం పరీక్ష చేయండి బాబూ!"

డాక్టరుకు అంతకన్న అర్థంకాలేదు. పరీక్షించి అంతా సజావుగానే వుందన్నాడు.

"అదేమిటి డాక్టరూ! ఈయన నాకు తాతయ్యట. నాకు తెలిసినంతలో నాకెవరూ తాతలులేరు. మీరైనా చెప్పండి. నన్ను చూచి వాళ్ళ తాలూకు ఎవరో అని అనుకుంటున్నాడు. ముసలితనంగదా, మతి భ్రమించి ఉంటుంది."

"కాదు మిస్టర్! ఈయన పదిరోజులుగా మిమ్మల్ని కని పెట్టుకునే తిరుగుతున్నారు. వారి మనవడివనే చెప్పారు. మీ అమ్మగారుకూడా వచ్చారు పాపం ఓసారి."

"మా అమ్మా! ఎక్కడికి? స్వర్గంనుండి వచ్చిందా? ఏమిటి డాక్టర్...మీరు చచ్చినవాళ్ళను బ్రతికించే కాయకల్ప చికిత్సగానీ నేర్చారేమిటి?"

"థాంక్ గాడ్. మీ ఇష్టం. ఈరోజు మిమ్మల్ని డిస్చార్జి చేస్తున్నాం. వెళ్ళవచ్చు."

ఈశ్వరుడు ఆలోచనలో పడ్డాడు. తనెవరో తనకు తెలుసు. మరి చుట్టూ ఈ పరిస్థితులు ఇల్లా గజిబిజిగా అల్లుకుంటున్నాయేమిటి? తనను ఏదో భ్రాంతం ఆవరించింది. లేకుంటే! ఏమైనా ముసలాయనతో వెడితేనే మేలు. ఆయన ఆర్భాటంయేమిటో తెలుసుకోవచ్చు. అని నిర్ణయించుకున్నాడు.

"అలాగే తాతగారూ! మిమ్మల్ని అనవసరంగా బెదరగొట్టాను. పదండి పోదాం. పాపం అమ్మ నా కోసం ఎదురు చూస్తుంది కాబోలు" అని బయలుదేరాడు

త్రోవపొడవునా ముసలాయన్ని పరిశీలిస్తూనేవున్నాడు. ఈయన్ని ఎప్పుడో యెక్కడో చూచిన గుర్తున్నది. ఎప్పుడో పరిచయం అయిన వ్యక్తిలాగానే కనిపిస్తున్నాడు. తను గుర్తుపట్టలేకపోయాడేమో, దూరపు బంధువేమో.

ఇంటికి వస్తూనే, కారులోంచి కాలు క్రిందపెడుతూనే ఆశ్చర్యపోయాడు ఈశ్వరుడు. ఈ యిల్లు...అవును ఎప్పుడో చూచాడు జ్ఞాపకంవస్తోంది. తను తిరిగిన ప్రదేశాలే ఇవిఅన్నీ.

నారాయణయ్య బెరుకుబెరుకుగ్గానే అనుసరిస్తున్నాడు.

"అమ్మాయ్, బాబు వచ్చాడమ్మా!"అని కేకవేశాడు.

సుశీలమ్మ ఎర్రనీళ్ళ చెంబుతో, గుమ్మంలోపల కాచుకునే వున్నది. రాగానే చెంబెడు నీళ్ళు దిగదుడిచి పారపోస్తుంటే, విస్తుపోయి కళ్ళు ఇంతవి చేసుకుని చూచాడు.

"నాయనా ఎంత చిక్కిపోయావురా" అని కన్నీళ్ళు వత్తుకుంది సుశీలమ్మ.

"మీరెవరమ్మా?" అడిగాడు భయంగా.

"నేను బాబూ మీ అమ్మను కదూ"

"కాదు. మీరు నా తల్లి కాదమ్మా. ఏదో పొరపాటు జరిగిపోయింది. మా అమ్మ చనిపోయింది. నా పెళ్ళయిన నెలకే చనిపోయింది మా అమ్మ. మీరెవరో నాకు తెలీదు. మోస పోయి మీ అబ్బాయినని భ్రమిస్తున్నారు."

"రామ రామ ఎంతమాట! నీకు పెళ్ళా! పిచ్చివాడా నీకు పెళ్ళేమిటి? కావటమేమిటి? నేనే మీ అమ్మని నాయనా. ఆ పాడు కారు ప్రమాదంలో మతి చలించింది. అంతే నాయనా..."

ఈశ్వరుడు యిక వాదించలేదు. తన అంతరాత్మ చెబు తోంది ఆమె తనకు తల్లి కాదని. ఆ ముసలాయన తాత అంత కన్నా కాదు, ఇదేదో జరగకూడనిదే జరిగింది.

నెమ్మదిగా ఆలోచనగా. లోపలకు వెళ్ళాడు. తనకోసం అమర్చిన పక్కమీద కూర్చుని ఆలోచనలోపడ్డాడు. కాని చిక్కువిడడంలేదు.

ఓ అరగంటపోయిన తర్వాత ఆమె భోజనానికిపిలిచింది.

"బాబూ, అన్నానికి రా నాయనా" అని.

"అమ్మా! ......" ఇదో అనుభూతి, అయిష్టంగానే వెళ్ళాడు. నలుమూలలా పరికిస్తూ నాలుగు మెతుకులు ఎంగిలి పడి బయటపడ్డాడు.

"బాబూనిద్రపోకు. పత్యంమెతుకులుతిని నిద్రపోకూడదు కొన్నాళ్ళదాకా." అని వెనకనుండి హెచ్చరించింది.

"సరే అలా బయటకు వెళ్ళివస్తాను."

"ఇప్పుడెందుకు నాయనా విశ్రాంతి తీసుకోక. రేపు పోగూడదూ?"

"ఇంట్లో వుంటే నిద్రవస్తోందిగా. అలా కాలేజీవరకు వెళ్ళివస్తాను."

"సరే. తొందరగా వచ్చేయ్. ఎండలో నడవకు. టాక్సీ వేసుకుపో" అన్నది.

కాలేజీకి నడుస్తున్న ఈశ్వరరావుకు ఊరు కొత్తగా తోచింది. కొత్తకొత్త భవనాలు కన్పించాయి. సిగరెట్లు కొనే అంగడిస్థానంలో పెద్ద కాఫీహోటల్ వెలిసింది. గలీజుగా ఉండే రోడ్లు పరిశుభ్రంగా ఉన్నాయి. ఆశ్చర్యపోతూనే పోయాడు కాలేజీలోకి. స్టాఫ్‌రూంలోకి వెళ్ళి ఆశ్చర్యపోతూనే కుర్చీలో కూర్చున్నాడు.

"ఏవయ్యా ఇక్కడికొచ్చావ్! కలాసాయేనా?" అడిగాడు ఓ పెద్ద తరహా లెక్చరర్.

"మాస్టరూ! మీరు రామశాస్త్రిగారు కదూ" అడిగాడు ఈశ్వరుడు.

"అవునుగానీ ఇలా వచ్చావేం?"

"మీరు చాలా చిక్కిపోయారు మాస్టరూ. జబ్బు చేసిందా, జుట్టు కూడా పండిపోయింది. మీ పాపకు ఈ ఏడాది పెళ్ళి చేస్తారా?"

రామశాస్త్రి తెల్లపోయాడు. పాపకు పెళ్ళేమిటి? పాపకు పెళ్ళయి ఎంతో కాలమైతే. నలుగురు బిడ్డల తల్లి అయి,

సుఖంగా సంసారం చేసుకుంటుంటే ఈ అప్రాచ్యపు కూత కూస్తాడేం రౌడీ వెధవ.

"వస్తా. క్లాసుకు పోవాలి" అంటూ లేచి ప్రిన్సిపాలు దగ్గరకు వెళ్లి ఫిర్యాదు చేశాడు.

మరో పది నిమిషాలలో ప్రిన్సిపాల్ వద్దనుండి ప్యూన్ వచ్చాడు "అయ్యగారు పిలుస్తున్నారు" అంటూ.

విధిలేక ప్రిన్సిపాల్ గదిలోకి వెళ్లాడు.

"గుడ్ మార్నింగ్ సార్" అని చెప్పి తెల్లబోయాడు.

"ఈ ప్రిన్సిపాల్ ఎవరూ! రామారావుగారు ఏమైనారు? ఈయన నెప్పుడొచ్చారు?"

"మిస్టర్ ఈశ్వరరావు! నీ ప్రవర్తన బాగా లేదు. స్టాఫ్ రూంలోకి వెళ్ళి కుర్చీలో కూర్చోడం, లెక్చరర్ శాస్త్రిగారొస్తే అమర్యాదగా ప్రవర్తించటం — మంచివాడివి గనుక ఈ సారికి క్షమించి వదలి వేస్తున్నాను" అన్నాడు ప్రిన్సిపాల్.

"అదేమిటి సార్. మీారనేది నాకర్థం కావటంలేదు. ఎవరితో తమరు మాట్లాడేది? ఈశ్వరరావు ఎవరూ! ఇక్కడ నేను తప్ప ఎవరూ లేరే."

"నీతో నే" గద్దించాడు.

"క్షమించండి. నా పేరు కామేశ్వరరావు. మీారు కొత్తగా వచ్చారు కదూ పేరు మరచిపోయి ఉంటారు. ఇంగ్లీషు లెక్చరర్ కామేశ్వరరావును."

"నువ్వా?"

"ఆఁ నేనే సార్."

"కూర్చోండి. ఇప్పుడే వస్తాను," అని బయటకు వెళ్ళి మేనేజరును విచారించాడు.

"నిజమే సార్! కామేశ్వరరావు అనే లెక్చరర్ ఇరవై యేళ్ళ క్రితం చేరాడు. ఆయనా, నేను ఈ కాలేజీలో ఒకేసారి చేరాం. మంచివాడు. జలజ అనే మరో లెక్చరరు, ఆయన యాక్సిడెంట్‌లో చనిపోయారు. ఆయన కొడుకే ఈశ్వరరావు. నాకు తెలుసు," అని చెప్పాడు మేనేజరు.

ఏమిటీ చిక్కు సమస్య.

తిరిగి తన గదిలోకి వచ్చాడు.

"మిస్టర్ కామేశ్వరరావు! మీరు బి. ఏ. క్లాసు తీసుకోండి ఈ పీరియడ్. నేనూ మీ క్లాసులోకి వచ్చి కూర్చుంటాను" అన్నాడు.

"అలాగే రండి."

ప్రిన్సిపాల్ వెంట ఉండడంతో ఆ వచ్చినవాడు ఈశ్వరరావు అని తెలిసిన కొందరు విద్యార్థులు నోరెత్తలేదు. క్లాసు తీసుకున్న కామేశ్వరరావు తన మామూలు ధోరణిలో అనర్గళంగా ఉపన్యసించాడు.

బయటకు వచ్చాక ప్రిన్సిపాల్ అన్నాడు.

"మిస్టర్ కామేశ్వరరావు! నేను సాయంత్రం మీ ఇంటికి వచ్చి కలుస్తాను. మీతో మాట్లాడవలసిన ముఖ్యవిషయాలు ఉన్నాయి కొన్ని. మీరు ఇంటికి వెళ్ళి విశ్రాంతి తీసుకోండి" అని పంపించి వేశాడు.

అతను అటు పోగానే యూనివర్సిటీకి టెలిగ్రాం ఇచ్చాడు. నగరంలోని వైద్య నిపుణులకు సంగతి తెలియ చేశాడు. ఫలితాల కోసం ఎదురు చూస్తున్నాడు. మిగిలిన లెక్చరర్స్‌తో సమాలోచించాడు.

ఇంటికి వెళ్లిన ఈశ్వరరావు యథాలావంగా లోపల గోడ కున్న సుశీల ఫోటో చూశాడు. దగ్గరకు వెళ్ళి పరిశీల నగా చూచి, ఓ రెండు నిముషాలు ఆలోచించి —

"ఈ అమ్మాయి సుశీల కదూ!" అన్నాడు.

"సుశీల ఎవరు బాబూ?"

"ఎవరా! సుశీల ఫోటో ఇక్కడి కెలా వచ్చింది? మీకు బంధువులా?" అడిగాడు.

"అవును బాబూ మాబంధువుల అమ్మాయే. కాని ఆ అమ్మాయి నీకు తెలుసా?"

"తెలుసా! నాకు పెళ్ళయిందని చెప్పానుగా. ఈ అమ్మాయే నా భార్య. ఎక్కడున్నది? అవును. పురిటి కని పుట్టింటికి వెళ్లింది గదూ."

గతుక్కు మన్నది సుశీలమ్మ.

పిడుగులు వర్షించాయి ఆమెపైన.

"అవును బాబూ" అంటూ నారాయణయ్య దగ్గరకు పరుగెత్తింది. జరిగిన సంభాషణ అంతా చెప్పింది. నారాయ ణయ్య హడావుడిగా పరుగెత్తుకు వచ్చాడు.

"బాబూ...బాబూ అలా కూర్చో నాయనా, నీతో కొంచెం మాట్లాడాలి. నీవు కూడా కూర్చోమ్మా," అంటూ ఇద్దరినీ కూర్చోపెట్టాడు.

"బాబూ...నన్ను ఎప్పుడైనా చూచావా?"

"ఆc...అదే అనుమానించాను. మిమ్మల్ని ఎక్కడో ఎప్పుడో చూచాను. జ్ఞాపకం రావటంలేదు."

"ఈమెను చూచావా?"

ఆలోచనలో పడ్డాడు. సుశీలమ్మ తల వాంచుకున్నది కన్నీరు కారుస్తూ.

కామేశ్వరరావు అనే వ్యక్తి యాక్సిడెంటులో చని పోయిన నాటినుండి నేటివరకు జరిగిన సంగతి యావత్తు చెప్పి-"ఇదేదో విపరీతంగా ఉన్నది నాయనా" అన్నది.

"అయితే అమ్మా ... నీవు?"

"అవును బాబూ...నేను...!"

ఆ రాత్రే హుస్సేన్ సాగర్‌లో సుశీల(మ్మ) శవం తేలింది. ఆ రాత్రే ఎటు వెళ్ళేదో కూడా తెలీని రైలులో పిచ్చివాడై ప్రయాణం చేశాడు (కా)మేశ్వర రావు.

# అంతర్వాణి

అదో...అదీ పానగల్ పార్కు.

చూచావా! ఇలా రా......

లోపలకు,

ఇదిగో...దీన్నే ఫౌంటెన్ అంటారు.

ఆ మూలగా ఓ ఎండిపోయిన చెట్టు కనిపిస్తోందా! దాని మాటునే వీడు మహాకావ్యాలు వ్రాసింది. ఆ చెట్టు జన్మలో ఇక చిగర్చదులే! ఎందు కంటావా? దాని నీడ పట్టుగానే అస్మదాదుల అభ్యుదయ కావ్యసృష్టిచేస్తే. అం! అందుకని ...

పోతే ఈ సిమెంటు బల్లవుంది చూశావా? కల్ప వృక్షం నీడలోని పాలరాతిపీఠం వతు ఇది. ఎండ, వాన లేకుంటే బల్లపైన, అవి రెండు ఉధృతంగా ఉంటే బల్ల క్రింద ఈ కవి వ్రాయుడే మకాం, కొన్ని రోజులు...నెలలు...సంవత్సరాలు.

నాయనా! అత్తరి బిత్తరి పోకు. ఇప్పుడే నమైంది చూడు — ఆ ఎదురుగ్గా కనిపిస్తోందే రోడ్డు — అటు, ఇటు బారులు తీరిన చెట్లు, చెట్లనీడల పక్షుల్లా కార్లు. ఇది మనం విహరించే నందనోద్యానం సుమీ! ఇక్కడ విహరించే వారికి, ఆకలి దప్పుల ప్రశక్తి రాదయ్యా— మామూలు వాళ్ళమాట కాదు నేననేది. మనవంటే... కలిగండరగాళ్ళకు.

చెన్నాపట్నం మొహం ఎరగనట్టు అలాగా బిత్తరి చూపులు చూస్తావేం భయ్యా! ఈ పాండిబజారుంది చూశావ్-అద్భుతం అనుకో! పూర్వ ప్రబంధాల్లో చదవలే? బహుశా చదివి ఉండవు. అసలు ప్రబంధ కవులు రాసి ఉండరు దీన్ని గూర్చి. అందుకే మహాకవులు కాలేదు. వాళ్ళకు అసలు బొత్తిగా జ్ఞానం లేదు దీని విషయంలో. తెలిస్తే శ్రీనాథుడే వచ్చి ఈ శీతలచ్ఛాయల మకాం వేసేవాడు కాదుటయ్యా భయ్యా!

ఇది పాండీబజారన్నానా? వెనక పాండవ మధ్యముడు, ఇటు ఈ వీధిన పోతున్నప్పుడే — అప్పుడు వీధి కాదు, అడవి మార్గం అనుకో—సుభద్ర పైన మనసు మరులు గొన్నదట! అది వేరే కథలే!

అప్పట్లో ఇదంతా అరణ్యం అన్నానుగదా! అర్జునుడు మెరీనా తీరంలో స్నానం చేసి...ఇక్కడే తపస్సు చేసేవాడట. ఆ ప్రభావం ఇంకా పోలేదు. ఇక్కడ అలా నిలువుగాళ్ళమీద తపస్సు చేసేవాళ్ళు ఈనాటికి ఆ పాండవ మధ్యముని శిష్య ప్రశిష్యులు వందలు, వేలు...అదీ దీని కథ...ఉపకథాను.

మరయితే దాని కథలో నాకేమిటి సంబంధ మంటారా.... వస్తా...మరి.

చెడి చెన్నాపట్నం పోవటం......ఆ కాలి కాలంలో మామూలు. ఈ రోజునైతే చెన్నాపట్నం వచ్చి మరీ చెడి పోతున్నారనుకో! వచ్చి బాగుపడటం అంటారా? అదృష్టం,

అంటే మనం అనుకున్న బండి సకాలంలో రావాలి. చచ్చీ చెడి వచ్చినా అందులో మనకు ఎడం ఉండాలి మరి.

విశాఖపట్నంనుండి చెన్నాపట్నం వరకూ రావట మంటే మెందుకో వచ్చానని. బాగుపడదామనా, చెడిపోదామనా, ఎవరయినా బాగుపడదా మనుకుంటారా...హాయిగా అక్కడే పుట్టి పెరిగిన మెట్టపైనే ఓ ఉద్యోగం వెదుక్కొని కూర్చోక; తిన్నది అరక్క, కలానికి ఎర్ర రంగు పులిమి, దాన్నిండా ఎర్రింకు పోసుకుని, జుట్టు గంపంత పెంచుకుని, పైజామా కొసలు బ్లేడుతో చీరుకుని రావటం. ఏం జీవితం చేదయ్యా! కాదయ్యా నిజం...కాదు.

మరెందుకని అంటావా?

ఆవిడ పిలిచిందని.

ఎవరావిడ?

మా ఆవిడ కాదు. మనకు ఆవిడెక్కడసలు. అదే కీర్తి కాంత. అది చాలమందిని వలిచేసింది. పో-కవితా కన్య.

కన్య అంటే అదేదో కథలో కనిపించిన, ఏడు మల్లె మొగ్గలంత బరువు, అవుపించి అవుపించని నడుము, సంపెంగ రేకుల పెదాలు, పద్మాల కళ్ళు, తుమ్మెద ముంగురులు... అవటాని ఊహించుకున్నావేమిటి కొంపదీసి. కానే కాదు, ఒకప్పుడేమో-మరి నన్ను వలచిన చిన్నది...కన్య...అచ్చం బ్రాందిరంగులో వుంటుంది. పొడవుకూడా నాలుగుబుడ్లు ఒకదానిమీద ఒకటి పేర్చినంత. ఆ అమ్మాయి కట్టుకునేచీర పనామా సిగరెట్టంత తెలుపు, వాసన అంత ఘాటు. నాలుగు

పెగ్గులు బిగించినంత నిషా కళ్ళు. అందుకే ఆ అమ్మాయంటే నాకు వల్లమాలిన ప్రేమ.

అబ్బాయీ, ఆడవాళ్ళను నమ్మకూడదన్నారు తెలుసా! అందునా కన్యలను. కన్యలున్నారే వాళ్ళను అసలేనమ్మరాదు. ఈ నైలాన్ కన్యలు మరిన్నీ. ఒళ్ళంతా కళ్ళుచేసుకుని పిలుస్తున్నట్లే, ప్రేమిస్తున్నట్లే కనిపిస్తాయి కర్మ. అలా అని వెంట వచ్చామా...గోవిందా! మూడుబీచీల ఇసుక తిప్పించి, నాలుగు కొళాయిల నీళ్లు తాగించి, పానగల్ పార్కు సిమెంటుబల్లక్రింద సీటు చూపిస్తారు.

సరె! అదంతా యెందుకు సోదీ!

నా కథ-విను మరి!

నేనుగా, అలాగా! బావుకుందామనే ఊడిపడ్డానా! అదే నాంది...మన బ్రతుక్కు ... జేబుల్లో వున్న పిక్కలు కాస్తా నిండుకున్నాయా! దిక్కున్నవాడు లేడా?

ఎరిగున్న ముఖం చాటుచేసుకుందా? ఇంకేం మిగిలింది కళ్ళల్లో నీరు తప్ప. కొద్దిరోజుల్లో, వారాల్లో అదీ యెండి పోయింది. కళ్ళలో నెగళ్ళు మండాయి; అగ్నిపర్వతాలు ప్రేలాయి. కడుపులో ప్రేవులు కోపించాయి; వాటికేం కోపిస్తాయి? కార్పొరేషన్‌వారి పైపుల ధర్మం. ఇక్కడ ఉచితంగా నియమిత వేళల్లో నీరు త్రాగవచ్చు.

అది కథా ప్రారంభం...

ప్రారంభమైన కథ ఒకగాలిగా ముందుకు. తెలుగు సినిమాలాగా నన్నాదీ నత్తనడకు ప్రయాణించిందనుకో! ఎక్కడ

ఎక్కడ ఆగింది—సినిమా ఆగుతుందా పద్దెనిమిది రీళ్లు దొర్లే దాకా. ఇదీ అంతే తంతు. అయితే నాలుగు మొహాలు అవుపించి......'నీదీ మా మొహాల్లానే వుంద' అనుకుని, "అరి నీవుట్రా ... అన్నదగ్గరనుండి, ఫరవాలేదు ... పైకొస్తావు" అన్నదాకా జరిగి ఇంటర్వెల్ అయింది.

ఇంటర్వెల్...

రెస్టు తీసుకుందామని ఓ బెస్టు బుడ్డీ దట్టించి, ఇప్పుడు కాదు—అప్పుడెప్పుడో మాట. అప్పుడు నిషా లేదు. రాత్ కా రాజాగా మనం...చల్లగాలి మేస్తూ మెరీనా చివరన, జనం లేనిచోట్ల మనం కూర్చుని, విశ్రమించేమయ్యా...

విశ్రమించగా......పైకెగిరి పోయినంత పని అయింది. గాలిలో నేను అలాఅలా పోతూ నేవున్నా...... అదేదో ఇన్‌స్పిరేషన్, మూడ్ అనుకున్నా మొదట. కాని క్రింద ఇసుక తీరం, అటు సముద్రం—పచ్చగా, అందంగా ఝామ్మంటూ ఇంకా పైకి త్రోసింది.

త్రోసిందె పో...అక్కడ అప్సరసలు...వయ్యారంగా, వంపులు తిరుగుతూ, నగ్నంగా, ఫ్రెంచి చిత్రాల నగ్నసుందరి మణులవలె అవుపించారు. అంతతో ఆగారా! ఉసి కొల్పారు, పిల్చారు, నవ్వారు, కవ్వించారు. అక్కడెక్కడా మగాళ్ళు లేనంత మక్కువ పడ్డారు, పాపం! నిజంగా నాకు అవుపించలే. పోనీ లెమ్మని ఓ లలన చేయందుకుని కౌగిట చేర్చుకుని, ఆశగా కళ్ళలోకి చూచా.......ఆ కళ్ళు ఎంత తీయగా ఉన్నాయను కున్నావు?

"ఎవరు నువ్వు?" అన్నది ప్రేమభాషలో.

"ప్రేమ పక్షివి" అన్నా, అప్పటికి వ్యాకరణం మీద ప్రేమ లేదు.

"ఏం చేస్తావ్?"

"కవిత్వం రాస్తా. నీ మీద ఒక కొత్త రహం పద్దెం రాస్తా. నన్ను ప్రేమిస్తావా?" అడిగాను.

"ఇహి...హీ..." అని కిసుక్కున నవ్వింది.

"ఛీ! పద్దే: కే ప్రేమిస్తాగే టి? అంతకంటే నీకేం చేత కాదా?" అని అడిగింది.

"ఛీ" అనిపించింది.

బాధగా మూలిగింది ఎడద.

సముద్రం హోరుమన్నది. అమవస చీకటి తల విర బోసుకున్నది. ఉవ్వెత్తున ఎగసిన కెరటం వచ్చి వచ్చి నా గుండెల్లో వాలి, విరిగి పోయింది.

మెత్తని వెచ్చని స్పర్శ—నా తల క్రింద, మొహంపైన, అంగుళాల దూరంగా నిశ్వాసం.

కల కాదు ... నిజం కావాలనీ లేదు.

"ఉలిక్కిపడ్డాను; కాని లేవలేకపోయాను."

"ఎవరూ? కవితా కన్యవా?" అన్నానుట.

"ఆఁ! నా మీద కొత్త రహం పద్యం వ్రాస్తారా, ప్రేమిస్తాను?" అన్నది నవ్వుతూ. చీకట్లో, ఎక్కడో అభ్యుదయ కవితలో అర్థంలా మెరిసినయ్ ఆమె కళ్ళు.

"ఊఁ!" అని, అనుకుని సిగ్గడ్డాను కామోసు.

ఆమె చీర కొంగులో నా మొహం దాచుకుంది. వెచ్చని మెత్తని అనుభూతి కలిగింది. చీకటికి నన్ను దూరం చేయ ప్రయత్నిస్తోందేమో! ఆ కళ్ళు వెలుగుతున్నాయి. దూరంగా లైటు వెలుగు యేడుస్తోంది.

"మీరు చచ్చిపోలేదు" అన్నది.

"నేను చావాలనుకోలేదే!" అన్నాను బిడియ పడుతూనే.

"నేననుకున్నాను" అన్నది.

"నీవెవరు?" అడిగాను ఊర్వశో, వరూధినో అనుకుని.

"మీ కవితా కన్యను" అన్నది పుసిక్కున.

"అలానా! ఐతే ఓ సిగరెట్టు వెలిగించుకోనీ – నీ మీద ఓ కొత్త చందంలో పద్యం వ్రాస్తా" అన్నాను.

"మీ ఒళ్ళు బాగాలేదు" అన్నది.

"ఏం?"

"ఏదో మత్తుగా వున్నారు."

"ఇంకా మత్తు యెక్కువ కావాలి – ఇంకా కొత్త కవిత్వం వ్రాయాలంటే!"

"వస్తారా వెడదాం, నా మీద రాద్దురుగాని!"

"పద."

కవితాకన్య ఇల్లు చిన్నదేంకాదు. పెద్దదే. అసలు ఆవిడ కన్యకాదు; సంసారి అనిపించింది, ఇదివరకే కొందరు కవికుమారులు అక్కడ సేదతీరిన చిహ్నాలు స్ఫుటంగా కనిపిస్తున్నాయి. అయినా తప్పదు. కోరిన చిన్నది...కోరివచ్చింది.

కోరిక తీరాలిగా! మక్కువ సూరాకేసింది. మమత విక సించింది.

ఇంటర్వల్ ఐపోయింది.

రెండో సహం ప్రారంభమైంది భయ్యా!

సగం అలసిన జీవులకు మూడ్సు రావటం కష్టంకదా! బలవంతంగా మూడ్సు తెప్పించుకుని సంసారం చేయాలి. జీవిత నాటకం ఆడాలి. అకస్మాత్తుగా, మధ్యంతరంగా లైట్లు వేసేస్తే ప్రజ గోలెత్తుంది. పెట్టినడబ్బు వాపస్ అడుగుతుంది. అందుకే టెంపో లేపి బ్రతుకు. క్లయిమాక్సులేని కథ—జరిగిపోయింది. మూడ్సుకోసం బికడాతీస్తే—సరి, ఏయిర్ కండిషన్ రూమ్సులో హోటళ్ళు; కాదు హోటళ్ళలో ఏయిర్ కండిషన్ గదులు. వంకాలు, నిండుగా గ్లాసులు, రంగునీళ్ళు, నగ్నంగా అమ్మాయిలు—అదే మూడ్, కవిత్వానికి అవసరం.

అవ్వాసుకాని ఖయ్యామ్‌కి తిరగదు, ఖయ్యాలీ పాటలు రావు. నా కోసం కానేకాదు—నా ప్రజకోసం. వాళ్ళు సెబాష్ అంటే అదేకవిత. లేకుంటేలేదు. మనం బ్రతికేదిజనంకోసంగా! మనకోసం కానేకాదుగా...

కథ కంచికి వస్తోంది.

కవితాకన్య ఓరోజు ఇంట్లో అవుపించలేదు. నిపాదిగి పరికాయించి చూడగా, ఎదురింట్లో మెవరో యువకవితో సరాగాలాడుతోంది. అదీ స్వాతంత్ర్యం...బంగారు గొలుసేసి కట్టెయ్యవలసింది. చెయ్యలేదా పని.

ఆవిడ, ఆ మిఠాయి, చిన్నాడ, చిలిపి కవిత అలా పోయి, యెమరింట్లో మర్రసన్యాసితో గోపురం పెట్టిందా—సరే.

మనం చేసేదిలేక, ఐ. సి. హెచ్. లో కాఫీ సేవించి, నందనవన సదృశమైన పాండవవీధి విహరిస్తూ, ఇలా పూర్వ స్మృతులు తలపుకురాగా, ఇదో ఈ కల్పవృక్షం, ఈ పాలరాతి తల్పం పిలువందుకుని, ఇలా రాగా—రాగా ఇక్కడ మీరు కనిపించారయ్యా!

అంతా క్షేమమే గదా!

మిమ్మల్ని మరొకవ్వడైతే ఛస్తే గుర్తించే వాణ్ని కాదు — గుర్తించినా, గుర్తించనట్లే వెళ్ళిపోయేవాణ్ని. అంతే — అసలు మీరంతా మనుషులనీ, పోటివారనీ, సాటి వారనీ పాటించేపాటి విజ్ఞత కోల్పోయి చాలా కాలం అయిందిగా, అందుకు.

ఇంతకీ మీరు ఇక్కడికి వచ్చిన పనేమిటో దాని కథ, కమామీషు చెప్పనేలేదు. అలా పోయి ఓ అర వేసుకుందాం పదండి. అంతవరకే బ్రదర్! ఆపైన కోరకండి. ప్లేటు ఫిరాయించగలను.

నెనారు

# లీలా పరిణయం

"పోస్ట్!"

తలుపు చప్పుడయింది.

పడకకుర్చీ కిర్రుమని శబ్దం చేసింది.

చదువుతున్న పుస్తకం దూరంగా టేబిల్ పైకి దూకింది. సామాన్యంగా లీలకు పోస్ట్ రాదు. అడపా దడపా వచ్చినా అది అర్థంలేని పోస్ట్ అయివుంటుంది. ఏ స్నేహితురాలో వ్రాసినా ఆమెకు సంతోషం అనిపించదు. జీవితంలో తనను సంతోష పెట్టడానికి ఎవరూ వ్యక్తులు మిగిలి లేరనేది ఆమె నిశ్చితాభిప్రాయం.

ఒకే ఒక్క కవరు. తలుపు దగ్గరగా వేసి వెను తిరిగింది. పరిచయమైన దస్తూరి. ఎవరు? ఇంకెవరు? నిజమా! కలా! భ్రమా! నమ్మలేకపోయింది లీల.

కళ్ళు ఒక్కసారిగా చెమర్చినయ్. వ్రేళ్ళు చివురుటాకుల్లా వణికినయ్. ముఖం ఏదోలా మారి ఆనందానికి ఆశ్చర్యానికి మార్జిన్ ఎంతో తెలియజేసింది.

లీల నిజంగా తానా రోజు అదృష్టవంతురాలు ననుకొంది. ఎన్నాళ్ళనుండో కలలుగంటూ, ఎదురు చూస్తున్న ఉత్తరం, ఎవరికోరకైతే యింతకాలం ఎండిన మోడులా నిలిచి ఎదురుచూస్తుందో ఆ మహానుభావుని చేతి ఉత్తరం — లీల

జీవితంలో వెన్నెలలు లేవు. వసంతాలు లేవు. అన్నీ గ్రీష్మాలే! అన్నీ బీటలే!

లీల ముఖకవళికలు మారాయి. కళ్లు అదోలా చిట్లించి మళ్ళీ మళ్ళీ చదువుకుంది. తన భాషాపరిజ్ఞానంమీద తనకే నమ్మకంలేనట్లు నాల్గుసార్లు, అయిదుసార్లు... హృదయం దడ దడ లాడింది. చేతులు వణికాయి. పెదాలు బిగించి, పళ్ళు పట పట కొరికింది పాపం లీల. నెమ్మదిగా మడిచి టేబిల్ పైకి విసిరి వేసింది. కుర్చీలో దిగాలుపడి కూర్చుండి పోయింది.

"తుచ్ఛుడు...ఛీ" అనుకుంది.

ఆలోచనాతరంగాలలో మనస్సు వ్యాకులం అవుతోంది.

"లీలా! శుక్రవారంనాడు అమ్మాయిని చూడ్డానికి వెళ్ళుతున్నాం. నువ్వూ వస్తావుగదూ!"

ఎందుకు వ్రాసినట్లు తనకు? తనపైన కసి తీర్చుకోటానికా? ఏమిటి గోపాల్ భావన?

ఒట్టి నీచుడు, తుచ్ఛుడు అనుకుంది. స్వాతంత్రించలేని చవట. తాను చేసుకోబోయే పిల్లను నేను చూడాలట. చూచి? ఏమిటి యిదంతా! ఎందుకు చూడాలి. చూచి చేసేదేమిటి?

"భగవాన్ ఏమిటి నాకీ పరీక్ష?" అనుకుంది.

* * * *

"హా భగవాన్, ఏమిటి నాకీ పరీక్ష?" అనుకున్నది ఒకనాడు లీల గరల్స్ వెయిటింగు రూంలో ఒంటరిగా కూర్చుని.

ఆనాటి కాలేజీ జీవితం వేరు.

అందరిలో చాలా తెలివైందిగా గుర్తించబడి, అధ్యాపకుల మన్ననలు సైతం పొందుతున్న లీలకు అలాంటి అఘాయిత్యం జరుగుతుందని ఎవరూ ఎన్నడూ వూహించలేదు. అందానికి అందం, తెలివితేటలూ అన్నీ ఉన్నాయి. కాని ...

ఎందుకు జరిగిందో, ఎలా జరిగిందో ఊహించలేక పోయింది. అసలు గోపాల్ ఎవరో తెలీదు తనకు? ఎలా వుంటాడో తెలీదు. అతని మంచి చెడ్డలు ఏమిటో తెలీదు?

కాలేజీకి వస్తూంటే వెనక ఎవరో గుసగుస లాడటం విన్నది. తలెత్తి చూచేసరికి గోడ మీద 'గోపాల్ — లీల' కార్టూన్ బొమ్మలు వేయబడి క్రింద పేర్లు వ్రాసి ఉండటం చూచింది. కాళ్లు పట్టు తప్పినంత పనైంది. కళ్లు నిజంగా తిరిగినయ్. చెవులు మూసుకుని వెయిటింగ్ రూంలో కొచ్చిపడ్డది.

అంతే "బ్రతుకు జీవుడా" అనుకున్నది.

ఎవరూ తనతో పలుకలేదు అందరూ తనని చూచి గుసగుసలాడుకోవటం, చప్పరించటం, హేళన చేయటం ... ఏమిటీ విపత్తు ...

అంతలోకి శకుంతల వచ్చింది. బెల్ మ్రోగింది.

"లీలా! ఏమిటే యిదంతా?" అన్నది శకుంతల.

"ఏమో నాకూ ఆశ్చర్యంగా వుంది."

"నిజంగా నీకేం తెలీదా? — నిప్పు లేకుండానే పొగ రాజుతుందంటారా?"

"ప్రళయంలో అలాగే పుట్టుకొస్తుంది."

"పద క్లాసులోకి వెడదాం?"

"ఏమిటో భయంగా ఉందే?"

"నీ మొఖంగాదూ ... రా ... రా?"

క్లాసులోకి వెళ్ళారు. అంతా పిన్ డ్రాప్ సైలెన్స్.

"ఎవరే ఆ గోపాల్ గాడు?" అడిగింది లీల.

"అదుగో మూడో బల్లమీద...సెకండ్...అతనే."

లీల అటు తిరిగి చూచింది. క్లాసంతా ఘొల్లు మంది. వెనక బెంచీల మీద నుండి విజిల్స్ వినవచ్చాయి.

లెక్చరర్ కు అర్థం కాలేదు. తెల్ల మొఖం వేసుకు చూస్తున్నాడు.

లీల లేచింది. శకుంతలా లేచింది. వెయిటింగ్ రూంలోకి వెళ్ళిపోయారు.

"నేను చదువు మానేస్తానే శకూ."

"ఛీ ... ఇంత మాత్రానికే?"

"ఇది చాలు, ఇంతకంటె అవమానం మరేం కావాలి బ్రతుక్కి?"

"మాని ఏం చేస్తావ్ ... గోపాల్ ని చేసుకుంటావా."

"ముయ్ నోరు. ముక్కు మొహం తెలీనివాడు ... అతణ్ణా!"

శకుంతల బ్రతిమలాడింది. లీల వినలేదు.

తిరిగి కాలేజీలో అడుగుపెట్టలేదు, పెట్టదు కూడా. లీల శపథం చేసిందంటే అంతే. లీల రాలేదని విచారించిన వాళ్ళు బహుశా కాలేజీలోనే లేరేమో!

* * * *

ఒక అనుకోని చిన్న సంఘటన జీవితాల్ని ఎలా మార్చి వేయగలదో లీలకు తెలిసింది. ఆ క్రింపటి రోజు వరకూ అలా జరుగుతుందని అనుకోలేదు. అసలు తన జీవితంలో అలాంటి సంఘటనలు జరుగుతాయని కూడా ఊహించలేదు. లీల నిజానికి నిప్పు లాంటిది. అల్లరి చిల్లర వ్యక్తి కాదు. ఎవరి వైపూ కన్నెత్తి అయినా ఎన్నడూ చూచి ఎరగదు. కాని ఇలా జరగటానికి కారణం ఏమిటి? దైవ ప్రేరణ ...

లీలకు తండ్రి లేడు. తల్లి ఒక్కతే. తోబుట్టువుల్లేరు... నిరాధారమైన జీవితం ఆమెది. ఎలాగో పెళ్ళి చెయ్యాలని ఆ తల్లి ప్రయత్నిస్తూనే వుంది. కానీ వీలుకాలేదు. అసలే అంతంత మాత్రంగా వున్న సంసారంలో ఈ ఉప్పెన ఎలాంటి పరిణామాలు తీసుకువస్తుందో ఊహించగలం. అలాగే జరిగింది. నాలుగువాడలా గుప్పుమంది. లీల బ్రతుకు పదిమంది నోళ్ళలోను పడ్డది.

లీలకు దిక్కు తోచలేదు. ఏం చేయాలి? ఏం చేస్తే తన బ్రతుకు తెల్లవారుతుంది. పెళ్ళికి అన్నీ అడ్డంకులే. డబ్బు లేదు. కట్నంలేకుండా మంచి వరుడు దొరకడు. అందునా కడు బీద సంసారం. నా అన్నవాళ్ళు లేరు. పైపెచ్చు ఈ మచ్చ. మాయని మచ్చ సంఘం తనమీాద బలవంతాన రుద్దింది. నిజానిజాలు ఎవరికి తెలుసు ...

"చనిపోతే ఏ బాధలూ ఉండకపోను" అనుకుంది.

మార్గాలు అనేకం అన్వేషించుకుంది. కాని ధైర్యం చాలలేదు.

అది జరిగిన కొద్ది రోజులకే ఒకనాడు గోపాల్ లీల ఇంటికి వచ్చాడు. అతన్ని చూచి లీల ఆశ్చర్య పడ్డది. రావటంలో గల కారణం? ఊహించగలదు.

"రండి" అంటూ ఆహ్వానించింది.

"నన్ను క్షమించండి లీలాదేవిగారూ...మీకు నావల్ల చాలా అన్యాయం జరిగింది. ఎలా జరిగిందో, ఎవరు ఈ ఘోరానికి ఒడిగట్టారో అర్థం కావటంలేదు" అన్నాడు.

"అదే నాకూ అనిపిస్తోంది. మీకు గిట్టనివాళ్ళు..."

"అంటూ ఎవరూ లేరు నాకు. నేనూ అలాంటి వాణ్ణి కాదు. ఎవరి జోలికీ పోయేవాణ్ణిగాను."

"అదంతా నా కర్మ గోపాల్" అన్నది.

"మీరు తిరిగి కాలేజికి రండి. నాకోసం, నావల్ల జరిగిన ఈ క్రియకు నేనే బాధ్యుణ్ణి తెలుసా. చదువు మధ్యలో ఆపటం ఏం బాగాలేదు" అన్నాడు.

"ఆ విషయాలు నాకు వదిలేయండి."

"అలా అనకు లీలా! నీవు మానేస్తే నేనూ మానేస్తా! నా మూలంగా నువ్వు ఇలా అయినావంటే లోకం నన్నంటుంది."

"లోకం అంటుందని కానీ లేకపోతే మీకా బాధలేదుగా!"

"అలా అంటే నేనేం చెప్పగలను" నీళ్ళు నమిలాడు.

అలాగే అనేకసార్లు ప్రయత్నించాడు గోపాల్.

ససేమిరా ఒప్పుకోలేదు లీల.

తిరిగి తన ముఖం కాలేజీలో చూపనంది.

"పోనీ మరొక ఊరు వెళ్ళి చదువరాదూ?"

"లాభంలేదు."

"నేనూ వస్తాను. పోనీ ఇద్దరం వెళ్ళిపోదాం?"

"నేరం నిరూపణ కావటానికి మార్గం" నవ్వింది.

గోపాల్ కుంచించుకుపోయాడు.

నరాలు బిగుసుకు పోతున్నాయి.

లీల అతన్ని ఆశిస్తోంది.

"పోనీ మనం..." ఆగింది

గోపాల్ పెద్ద ఆదర్శవాది అనుకుంది.

"అలాగే లీలా!" అన్నాడు.

లీల హృదయం ఆనందంతో పరవళ్ళు త్రొక్కింది. గోపాల్ తనవాడు. తనకు జీవితంలో అంతకంటే కోరదగింది లేదు. గోపాల్‌కు భార్యయై, జీవిత శేషాన్ని గడపటంకంటె తాను కోరదగింది లేదనుకుంది లీల.

వలపు తలపులతో, మధుర స్మృతులతో అట్టే కాలం గడపటానికి వీల్లేకపోయింది. వయసుతో పరిపక్వమయిన యవ్వనం వృథా అయింది. అనేకసార్లు, అనేక విధాల గోపాలాన్ని కవ్వించింది. రెచ్చగొట్టింది. కాని గోపాలం సుముఖుడు కాలేదు. కాని తన నిర్ణయాన్ని యిదమిద్ధంగా చెప్పలేక పోతున్నాడు. ఎంతకాలమని మనిషి, అందునా స్త్రీ కలలలో బ్రతగ్గలదు. పైపెచ్చు గోపాలాన్ని గురించి ఆనోటా ఆనోటా వింటున్న వార్తలు యదార్థాలేమో ననిపిస్తోంది.

గోపాలం చదువుకున్నవాడు, విజ్ఞాని కాని సంస్కారం శూన్యం. తల్లిమాట జవదాటలేదు. పెళ్ళి మిషతో కొన్ని

వేలు సంపాదించాలని గోపాలం తల్లి దండ్రుల తాపత్రయం. ఇన్ని వేలు పోసి చదివించిన గోపాలం ఉన్నట్టుండి కులంగా వో వనుచును పుట్టినే పెళ్ళి చేసుకోవటం వాళ్ళకి యిష్టంలేదు. పైగా లీలకు అండాదండా లేదు. అంటే వాళ్ళ పరిభాషలో ఆలనా పాలనా లేదని అర్థం. దానికి పెంపకం తాత్పర్యం. పైగా లీలను గురించిన కట్టుకథలు వినకపోలేదు. ఏది ఏమైనా గోపాలం ప్రేమించినంత మాత్రాన లీలను పెళ్ళి చేసుకోవటం వాళ్ళ కిష్టంలేదు. ఆ అభిప్రాయాన్ని గోపాలం కాదనలేక పోయాడు.

అంటే! లీల విన్నమాట దుర్భరం.

ఓరోజు కుండబ్రద్దలుకొట్టినట్టు అడిగేసింది గోపాలాన్ని.

"అవును లీలా...అమ్మా నాన్నా కాదన్న సంబంధం ఎలాచేసుకోను. పెంచి పెద్దవాణ్ణిచేసి, చదువు చెప్పించినందుకు వాళ్ళని కాదని దుఃఖపెట్టటం ఏం న్యాయం?" అన్నాడు గోపాలం.

లీల వాదించలేకపోలేదు. ప్రేమించిన స్త్రీని కాదని ఆమె జీవితం బజారుపాలుచేసి సర్వనాశనం చేయగల సమర్థుడు, తల్లిదండ్రులను ఎలా కాదనగలడు?

ఒకవేళ యిలాంటి ప్రబుద్ధుణ్ని చేసుకునిమాత్రం తానేమి సుఖపడగలదు? రేపు ఒకవేళ చేసుకున్నా "మావాళ్ళకు యిష్టంలేదు. నీతో కాపురం చెయ్యను" అనవచ్చును-అనగలుగుతుంది. అలాంటి గోపాలాన్ని బ్రతిమాలాడి, భంగపడి ప్రయోజనం ఏమిటి? శూన్యం.

గోపాలం వాదాన్ని ఏ కారణంచేతనో కాదన లేదు లీల. ఆతని పిరికితనానికి నవ్వొచ్చింది. జాలి వచ్చింది తన ఖర్మకు! అంతే...అంతకుమించి ఆమె చేయగలిగిందీ లేదు నిజానికి. అతనితో వాదించటం శుద్ధ దండగ. లోకమే కాదు, భగవంతుడుకూడా తనను పరీక్షిస్తున్నాడని నిర్ణయించుకుంది. ఏ జన్మలోనో చేసిన మహాపాపానికి ఈ జన్మలో అనుభవిస్తోంది. అంతకంటె తాను చేసిన తప్పిదం ఏముంది?

*  *  *  *

తల్లి చనిపోయింది. కూతురి భవిష్యత్తును గురించి విచారించి, కుమిలి కుమిలి ఏడ్చి, తుదకు ప్రాణాలు వదిలేసింది. ఇంక లీలకు మిగిలిన అప్పులంటూ లేవు. మిగిలిన ఆస్తంటూ కూడా లేదు. ఉద్యోగంచేయక తప్పిందికాదు. అదృష్టవశాత్తు ఉద్యోగం అయింది దగ్గర్లోనే.

ఇప్పుడు లీల జీవితంలో ఒడుదుడుకులు లేవు. ఉన్నదంతా ఒకే ఒక్క విచారం. ముందుగతి ఏమిటని. భవిష్యత్తు చీకటిగా వుంది. ఓ వెలుగుకిరణమైనా అగుపించటంలేదు. ఏనాడో గోపాలంమీద ఆశలు ఒదులుకుంది. అయినా అతన్ని మరచిపోలేక పోతోంది ఇంకా గోపాలానికి పెళ్ళికాలేదు. కనుక ఏనాటికైనా పశ్చాత్తాపపడి తిరిగి తనదగ్గరకే వచ్చి తనను చేపడతాడని నిగూఢ వాంఛ.

తద్వ్యతిరేకంగా ఈ ఉత్తరం అందింది.

"గోపాలం—పాపం ఒట్టి అమాయకుడు" అనుకుంది.

ఈ గోపాలం తన జీవితం నాశనం చేశాడు. ఇతని మూలంగానే తన బ్రతుకు బండల పాలయింది. ఆనందం, సుఖం అంతరించాయి. లోకంలో మగాళ్ళంతా ఈ గోపాలం వంటి వ్యక్తులే అయితే ఆడవాళ్లు బ్రతకలేరు. రేపు ఆ చేనుకో బోయే అమ్మాయి ఏం సుఖపడుతుందో పాపం! అనుకుంది. అనుకుంటూనే మూగగా ఆలోచనల్లో మునిగిపోయింది.

*    *    *    *

చల్లని చెయ్యి తన బుగ్గల్ని తాకింది. ఏవో అస్పష్టమైన మాటలు వినబడుతున్నాయి. మైకం ఒదల్లేదు. ఎవరో "అక్కా! అక్కా!" అని పిలుస్తున్నారు.

కళ్ళు తెరిచింది. బాబు తన మొఖం నిమురుతూ పిలుస్తున్నాడు. తన కళ్ళు చెమ్మగిల్లినయ్. చారికలు చెక్కిళ్ళ మీద స్పష్టంగా అగుపిస్తున్నాయి.

"ఛీ ఏమిటి ఇలా చేశాను" అనుకుంది.

"ఏం బాబూ...ఏమిటి? దా కూర్చో" అంది. ఒళ్ళో కూర్చోపెట్టుకుంది.

బాబు అంటే లీలకు తగని ప్రేమ. ప్రక్కింటి సుశీల కొడుకు బాబు. సుశీల కేం అదృష్టవంతురాలు. భర్త, కొడుకు, వండు వెన్నెలాంటి సంసారం. అంతకంటె ఏం కావాలి. తన కా అదృష్టం ఈ జన్మకున్నదా? లేదా? తనకూ ఓ భర్త ఉండి, బాబులాంటి ఓ కొడుకు ఉంటే ఎంత బాగున్ను. ఆ నోము నోచుకుందా తను...

"ఏం బాబూ ఏమిటి...బిస్కట్టు ఇవ్వనా?" అంది.

"ఊహు" అంటూ బుంగమూతి పెట్టాడు.

"మరి ?"

"మరే...అమ్మ ఏడుస్తోంది అక్కా ?"

"ఎందుకు బాబూ !"

"మరే నాన్నె అమ్మను కొట్టారు...అందుకని...?"

"నాన్న అమ్మను కొట్టారు, అందుకని ఏడుస్తోందా" నవ్వుతుంది లీల.

అంతలోనే సుశీల వచ్చింది బాబును వెతుక్కుంటూ.

"రా అక్కా...కూర్చో" అంది.

"వస్తా నమ్మా లీలా పనివుంది..."

లీల పసిగట్టింది సుశీల ఎంతగా బాధపడుతోందో...

"ఎందుకని అక్కా కొట్టారట..." అడిగింది.

"నా కర్మ...చీటికీ మాటికీ తన్నులేగా బ్రతుకు. ఏదో చదువుకున్నారని, ఉద్యోగస్తులని అన్ని వేలుపోసి చేసుకున్నందుకు అనుభవిస్తున్నాను. ఏ నూతిలో నన్నా పడి చద్దామని పిస్తుంది. కాని బాబు కోసం బ్రతుకుతున్నాననుకో. నే చచ్చిపోతే వీణ్ణి చూచేవాళ్ళెవరు ? ఏది చేతి కందితే అది తీసుకు కొట్టటమే గదా ? లీలా...! నువ్వు అదృష్టవంతురాలివమ్మా నిజానికి. ఈ బాధలు లేవు. హాయిగా సంపాదించుకుంటావ్. నువ్వు తింటావ్, ఒకరి కింత పడేస్తావ్. పెళ్ళి చేసుకోవటమంత బుద్ధి తక్కువ పని నువ్వు చేయనందుకు నిన్ను చూస్తే ఎంతో సంతోషంగా ఉంటుంది.

"వస్తానమ్మా ఆలస్యమైతే మళ్ళీ తన్నులు. ఏ రంకులో కడతారు" అంటూ బాబును తీసుకు వెళ్ళిపోయింది.

"ఏమిటీ ప్రపంచం ?" అనుకుంది లీల.

అలాగే ఆలోచిస్తూ కూర్చుండి పోయింది కుర్చీలో. సుశీల జీవితం కళ్ళముందు కదులుతోంది. ఆమెకు కూడా కష్టాలున్నాయా! ఆమె భర్త ఇలాంటి వాడా! అంత సంస్కారం లేనివాడా! కొడతాడా!

ఇలాంటి నిజాలు లీలకు తెలియవు. ఉద్యోగస్తుడు, విద్యావంతుడు అయిన భర్తను కోరుకోవటంలో స్త్రీలు తప్పు చేస్తున్నారా అనిపించింది.

ఈ సాంఘిక సమస్యలకు పరిష్కారం ఏమిటి ? లోకంలో సుఖపడే మార్గం లేదా! ఎక్కడా విచారమేనా ?

*     *     *     *

"ఉన్నావా లీలమ్మ తల్లీ!" అంటూ వచ్చింది బామ్మ గారు......

"రండి బామ్మగారు...ఏం ఈ వేళప్పుడొచ్చారు ?"

"ఆ ఏముందమ్మ తల్లీ... కాశీకి టికెట్టెంతో తెలుసుకుందామని!" అడిగింది బామ్మగారు.

"అదేమి టండోయి బామ్మగారు ఎప్పుడు ప్రయాణం?"

"వెళ్ళక యిక్కడ ఉండిచేసే దేమిటి తల్లీ...ఆ మహాతల్లి నేనంటే కళ్ళలో నిప్పులు పోసుకుంటుంది...ఏం చేయను. ఏ కాశీయో రామేశ్వరమో పోయి కళ్ళు మూసుకుంటాను. కృష్ణా, రామా అంటూ" అన్నది.

లీలకు అర్థం కాలేదు ఆ మాటల్లో ధ్వని.

"అసలు సంగతి చెప్పండి బామ్మగారు.....ఊరికే రామేశ్వరం పోయినా ఏమిటి ప్రయోజనం?"

"ఏముందమ్మా. మహాతల్లి నా కోడలి శాపనార్థాలు భరించలేక చస్తున్నా. ఏ పని చేసినా అది అట్లా ఎందుకు చేశా వంటుంది. ఎల్లిమీద ఓల్లిమీద పెట్టి నానా మాటలు అంటుంది. పెద్ద ముండని గదా... అంతంత మాటలంటుంటే ఎలా చచ్చేది చెప్పు. ఆ కుర్ర గుంట ముక్కులు తెగకారు తున్నాయి గదా. చీమిడి తీస్తే...ముక్కు వాచేట్లు తీశానని ఒకటే సాధింపు. అంత మాత్రానికే వాడు గుక్కపెట్టి ఏడ్చా డట...ఓ తల్లీ నే బ్రతకలేను ఆ కొంపలో. ఎటన్నా వెళ్లి పోతాను."

"ఎంత మాటండీ బామ్మగారు! అట్లా అంటారే గాని మీరంటే ఎంత ప్రేమని. వీరమ్మొదిన నాతో ఎన్నోసార్లు చెప్పింది. మీరుండబట్టే ఆ ఇల్లు ఇల్లుగా ఉందటగానీ లేక పోతే ఏదో అయ్యేదని. మీ పిచ్చగాని మిమ్మల్ని ఎందుకు తిడతారండీ. ఏదో పని చికాకులో విసుక్కుంటే అనుకోండి. ఆ అన్నది మిమ్మల్నేనని మీ రెందుకు భ్రమపడాలి. మీరంటే ఆవిడకు ఎంత భక్తి, ఎంత ప్రేమ."

"నిజంగానా లీలమ్మా.....నిజంగా నేనంటే దానికి ప్రేమేనా?"

"అయ్యో రామా! నా మాట నమ్మరేటండీ" అన్నది లీల.

"పెద్ద ముండను...ఉండబట్టలేక ఇలా అంటానేగానీ మా చిట్టి బాబుని వదిలి నేపోగలనా...నే లేకపోతే వాడసలు అన్నమే ముట్టడు. వస్తానమ్మా లీలమ్మా. వాడు అన్నం తిన్నాడో, బొమ్మ కోసం మారాం చేశాడో" అంటూ లేచింది.

"అప్పుడే వెడుతున్నారా బామ్మగారు."

"వస్తానమ్మా! నీకేం అదృష్టవంతురాలివి. ఈ బాధలు నీకు లేవుగా...హాయిగా, సుఖంగా ఉండే నీకు మా ఇబ్బందులేం తెలుస్తాయి" అంటూ వెళ్ళిపోయింది.

*   *   *   *

"సుఖం?" ఆమాటకే అర్థం లేదు. నిజంగా తను సుఖపడుతోందా? ప్రశ్నించుకుంది. గోపాలం తనని మోసం చేశాడు. అయితేనేం? తనంటే హెడ్ గుమాస్తాకి ఎంతో ఇష్టం. మంచి అందగాడు కూడా...ఎవళ్లతోడి జోక్యం పెట్టుకోడు. రెండో పెళ్లి అయితేనేం? కుర్రాడేగా? ఇన్నాళ్ళ్ళు గోపాలంమీద ఆశలు పెట్టుకుని ముకుందంగార్ని కానీ, ఆయన కోరికని గానీ మన్నించలేక పోయింది.

ముకుందం తనని కాదనడు. తను మోడుగా బ్రతకలేదు. వసంతం...చివురు టాకులు, పూలు, కాయలు...... అనుభవించాలని నిశ్చయించుకుంది లీల.



# రాధానళినీయం

నవ వధువులా...

కళ్యాణ మండపంలో కాలిడుతున్న కన్నెపిల్లలా...

వన్నెలు, వయ్యారాలు, చిన్నెలు, చిరునవ్వులు పువ్వుల్లా వెదజల్లుతూ వచ్చే వసంతరాణి పాదమంజీర రవాలతో సరితూగేలాగా...

ముసిసిగ్గు దొంతరలు, కనురెప్పలై, బరువుగా, గోముగా, వాలుగా, అలవోకగా, ఆత్రంగా కనులెత్తి పరికించే కన్నెపిల్లలా, ఓసారి చుట్టూ పరికించి అడుగుమోపింది ఎక్స్‌ప్రెస్...

సికిందరాబాదు స్టేషనులో.

ఆ పెళ్ళికూతురు రాకకోసమే వేయికళ్ళల్లో లక్షవత్తులు వెలిగించి నోములు నోస్తున్న పండు ముత్తయిదువలు, కన్నెపిల్లలు, యవ్వనాంగులు లేచి, చీర కుచ్చెళ్లు సవరించుకుని, ఆత్రంగా, ఆర్భాటంగా అటూ ఇటూ చూపులు సారిస్తున్నారు.

ఆ చూపుల తూపులకోసం గంటలతరబడి షికార్లకి పచార్లు సాగిస్తున్న పాంటులు, నైలాన్ స్లాకులు, రిమ్‌లెస్ సులోచనాలు, ఆ సులోచనల సుహాసినుల లోచనాలలో అలాగే ప్రతిమల్లా నిలబడిపోయినారుకూడా.

మంద మందంగా, మంద గమనంగా, ఆగనున్న విశేషాల్ని మీనమేషాల్లో క్షణాల్లో లెక్కించేవారు లెక్కిస్తూనే

ఉన్నారు. అవేవీ పట్టాలు అతివల వలపులు, వలపుల తలపులు, తలపుల తీయదనాలు రుచిచూచి, చప్పరించేవారు చప్పరిస్తున్నారు. మొత్తానికి పెండ్లి పందిరిలాంటి సికింద్రాబాదు స్టేషను యావత్తూ ఒక్కసారిగా జీవించింది. ఆ జీవితంలో అనేక రుచులవారు, అభిరుచులవారు, భావుకులు, అభావుకులు, నిరీక్షకులు, ఉపేక్షకులు—అందరూ ఎందరో.

మొదటితరగతి పెట్టెలోంచి బయటవరకూ వచ్చి నిలబడ్డాడు—పురుషపుంగవుడు.

జపాను సిల్కులాల్చీ, పంచె, బెంగాలీబాబులాగా ముస్తాబై.

కళ్లకు అద్దాలులేవు కానీ ఉన్నట్లే భ్రాంతి కలిగిస్తుంది. ఆ వెడల్పాంటి కళ్లు—తెల్లగా మెరిసిపోతూ ఉంటే.

చేతిలో లెదర్ బాగ్. కాళ్ళకు పల్చటి జోళ్ళుతప్ప మరే ఆధారాలు లేనివాడు అతగాడు.

అతగాడలా సాలోచనగా అటూఇటూ చూచాడు.

ఆ చూపులు కొందర్ని నిరాశచేసినయ్. కొందర్ని ఆలోచనా పూరితుల్ని చేసినయ్.

ముందుకుపోతూ కొంటెగా ఒంటిగా ఉన్న అతన్ని చూచిన యువతీ లలామలు ఒక్కసారిగా [illegible]చలి బాధించగా, భుజాల మీద నిండుగా పైటల్ని గప్పుకొని, ఒత్తుగా గుండెలకు హత్తుకుని మరో [illegible] వేయలేక, [illegible] చిత్తంతో బాధపడలేక, ఆగనూలేక సాగిపోయారు.

అతని చూపులు అవేవీ పట్టనట్టు, ఎవరినీ చూడనట్టు చూచి, రెండు మూడు నిమిషాలు ఆగి నిట్టూర్చినయ్.

ఆ నిట్టూర్పు వేడికి తట్టుకోలేక ఆ చాయల్లో ఎవరూ నిలబడలేదు.

హుందాగా, మంత్రిలాగా మార్బలం లేకపోయినా, ముందుకు నడిచాడు.

అయినా ప్లాటుఫారం అంతా పరికిస్తూనే ఉన్నాయి చూపులు.

ఆ చూపులకు సంతృప్తి కలిగిందిగాను. అందుకే ఒంటరి తనాన్నే వలచి, తలపుల్ని దాపులకు చేరనీయకుండా ముందుకు నడిచాడు అతను.

*   *   *   *

సికింద్రాబాదు సిమెంటు రోడ్డుమీద మెత్తగా కారు జారిపోతూ ఉంది. కారులో వెనక సీట్లో కూర్చుని ఉన్న వేణు ఆలోచనలు అలాగే జారిపోతూ ఉన్నయ్. సన్న సన్నగా తుప్పర పడుతూంది. చల్లగా మేఘాలు. కోటలలాంటి భవంతులు అన్నీ వెనక్కు వెళ్ళిపోతున్నాయి. "చాలా అందంగా ఉన్నది" అనుకున్నాడు.

కారు హోటల్ కాంపౌండులో ఆగటంతో దిగి డబ్బులిచ్చి, లోపలికి నడిచాడు. ముందుగానే రిజర్వు చేయించుకున్నాడు కనక అట్టే శ్రమ అవలేదు. బోయ్ వెంటరాగా గదిలో అడుగుపెట్టాడు. కుర్రాడు కిటికీ రెక్కలు విప్పి, ఫాన్ వేసి, రేడియో ట్యూన్ చేసి "వేడి నీళ్లు రెడీ సార్" అన్నాడు.

ఇదంతా కొత్తగా ఉన్నా సంతృప్తిగాఉన్నది వేణుకు. డబ్బుపోయినా సుఖం. ఎంత హాయిగా ఉన్నది!

కిటికీలోంచి తొంగిచూశాడు.

దూరంగా కొండలు, ఎత్తయిన మేడలు, పార్కు, చక్కని గాలి, వెలుతురు—హోటల్లోంచి చూస్తే పట్టణం అంతా కనిపించి కళ్లు తెరిచింది.

బట్టలు విప్పి బాత్‌రూంలో ప్రవేశించాడు. ముందు స్నానంచేసి, తర్వాత కార్యక్రమం ఆలోచించవచ్చునన్న తలంపు.

ప్రాణానికి హాయిగానూ ఉన్నది.

బాత్‌రూంలోంచి మొహం తుడుచుకుంటూ గదిలో అడుగుపెట్టాడు. ఎదురుగా కుర్చీలో ఓ శాస్త్రీ కూర్చునిఉంది. ఆ శాస్త్రీ అసలు సిసలైన నీలకంఠం అనే వ్యక్తి తాలూకు అని గుర్తించడానికి అరక్షణంకూడా పట్టలేదు. నిర్లిప్తంగా నే, చూచీచూడనట్లు నటించాడు ఆత్రుతగానీ, ఆప్యాయతగానీ పైకి అవుపించనీయలేదు. అంతరాంతరాల్లో, లేదా రోదసీ సీమల్లో ఉంటే ఉండనీవు.

అతని ఉదాసీనతను గుర్తించిన నీలకంఠం అమాంతంగా సినీమాల్లోని ప్రియురాలిలాగా, అలిగిపోతున్న భర్తను కాళ్లా వేళ్లాబడి బ్రతిమలాడే సెల్యులాయిడ్ పతివ్రతలాగా మోకాళ్ల మీద కూర్చొని వేణు ఊరువుల్ని గట్టిగా బంధించి—

"క్షమించరా వేణూ......మాట నిలబెట్టుకోలేక పోయాను" అన్నాడు—నీలకంఠ నాయధేయుం.

అంతకన్నా డ్రమెటిక్‌గా పోజు మార్చి వేణు "ఎవరూ! నీలకంఠం! నువ్వా! ఇదేమిటి? ఛా, ఛా, లే, లే..." అంటూ బుజాలు పట్టుకుని సుతారంగా లేవదీయబోయాడు.

ఇద్దరికీ అవతల మరో వ్యక్తి లేకపోవటంవల్ల నటన సమపాళ్ళలో రక్తి కట్టిందో లేదో తెలుసుకోలేక తికమకపడి పోయే నటుడిలా, అలాగే ఉండిపోయి పోజ్షన్ మరిచిపోయి, వెధవ మొహంపెట్టి అందులో ఆలోచనలనే బొంగరాన్ని సుడులు సుడులుగా త్రిప్పుతూ నీలకంఠం—

"అలా అంటే కాదు. ఈ దీనుణ్ణి క్షమించావంటే గానీ వీల్లేదు" అనేశాడు.

"సరేలే. బుద్ధి గడ్డి తిన్నదన్ని ఒప్పుకున్నట్లేగా" అని సంజాయిషీని సమాధానంగా పుంజీభావంచేసి మరీ స్థిమిత పడ్డాడు వేణు.

రంగం మంచి రసపట్టులో ఉండగా, పట్టుమని పరుగెత్తు కొచ్చాడు హొటల్ బోయ్.

"అయ్యగారూ! పిలిచారా?"

"ఆఁ పిలవలేదు కాఫీ, పిలవాలనే అనుకున్నాను. పోయి రెండు మంచి కాఫీ పట్రా!" అన్నాడు వేణు.

"చిన్న సవరణ, మిత్రమా. కాఫీ బదులు టీ సేవిద్దాం. ఆరోగ్యానికి మంచిది. లేదా నీవు కాఫీ, నేను చాయ్—జంట నగరాలలాగా..."

"సరే నీ ఇష్టం...ఆఁ ఏమిటీ విశేషాలు?" అడిగాడు వేణు కుర్చీలో కూర్చుని-అద్దంలో చూచి మొఖానికి పౌడరుఅద్దుతూ.

"విశేషాల కేం కానీ...ప్రయాణం సుఖంగా జరిగింది గదా! ఇంటి దగ్గర అమ్మా నాన్నా అంతా కులాసా?"

"ఆహా! అందరూ కులాసా!" శ్రుతి కలిపాడు.

"ఒక్కడివే వచ్చావా? శ్రీమతిని కూడా తీసుకు రాక పోయినావా?"

"అదేమిటిరోయ్! శ్రీమతి అంటూ మతి పోగొట్టే స్తున్నావ్. నాకు శ్రీమతి ఏమిటి కర్మ?" వేణు ఆశ్చర్యం ప్రదర్శించాడు.

"ప్రయాణంలో నూ ప్రణయంలో నూ అర్ధాంగి ఉంటేనే లేకుంటే మజా లేదు..." నీలకంఠం ఆలోచనలు అరమైలు దూరందాకా వెళ్ళాయి.

"నీవు చాలా మారిపోయావు నీలకంఠం."

"మారకపోతే మజా లేదుకూడా."

నీలకంఠం తత్వం వేణుకు తెలియనిదికాదు. అతగాడు సికింద్రాబాదులో ఒంటరిగా ఉంటూ ఉద్యోగం వెలగబెడు తున్నాడంటే ఒకపట్టాన నిజం తెలిసినవాళ్ళు నమ్మరు, నమ్మ లేరు. కారణం నీలకంఠం రసికుడు...వేణులాగా ప్రవరాఖ్య సంతతివాడుకాడు. ఆనందాన్ని అందినంతవరకు జుర్రుకుందా మన్న ముగ్ధ కలవాడు. అందునా బ్రహ్మచారి. కళాభిలాషి.

నిజానికి నీలకంఠానికి ఏమీ తక్కువలేదు. చక్కగా సంపాదిస్తున్నాడు. మంచి జీతంగల ఉద్యోగం. పరువు ప్రతిష్ట లున్నాయి. కావాలనుకుంటే ఏ కలకంఠినో కంఠానికి కట్టుకుని సుఖపడగలడు. కాని తనకు తాను అలా అనుకోడు. తనకు

ఏమీ ఉన్నదనుకోడు. తన అందాన్ని చూచి లోకంలో ఏ స్త్రీ వరించదనే అనుమానం తనకు గట్టిగా ఉంది.

అందుకే అన్నాడు వేణుతో—

"వేణూ! అందం అనేదికూడా పూర్వజన్మ సుకృతమే. నీవు చూడు. నవమన్మథుడులాగా ఎలా ఉన్నావో! మగవాడికే మరులుగొలిపే నీ సౌందర్యం చూస్తుంటే, ఆడది ఎలా ఊరుకోగలదు అనిపిస్తుంది. నీవు ఊ అంటే ఏ అప్సరస అయినా ఇట్టే నీ వలలో, వలపులో చిక్కుకుంటుంది; వలచి వలపిస్తుంది..."

"నీకు మాత్రం ఏం తక్కువని?" అడిగాడు వేణు.

"అన్నీ ఉన్నాయి, ఐదో తనమే తక్కువ. ఆకర్షణ ఒక్కటే శూన్యం. పైగా ఒక్క నిమిషంలో నా తత్వం కనిపెట్టేస్తారు అమ్మాయిలు."

సంభాషణ ఊకదంపుడుగా సాగింది కొంతకాలం...

"నువ్వీ జంటనగరాల్లోకి ఒంటిగా ఎందుకు వచ్చినట్లు?" నిలదీసినట్లే అడిగాడు నీలకంఠం.

అందుకు సమాధానంగా చిరునవ్వు చిద్విలాసంగా చిందించి, ఓరగా కనులు పైకెత్తి చూచాడు వేణు.

అందుకోగలిగితే ఆ నవ్వులోనే కోటిఅర్థాలు అందుతాయి. ఆ చూపులోనే వేయి సమాధానాలు దొరుకుతాయి. అర్థం ఆవంత అయినా అయినట్లే తోచింది నీలకంఠానికి.

"ఏమైనా ఉద్యోగం సంపాదిద్దామని?" అన్నాడు. అది సమాధానం కానట్లు ధ్వని.

– నోరు తెరిచి ఇది నా ధ్యేయం అని చెప్పినా, కాదని నొసలు సాక్ష్యం ఇస్తూనే ఉన్నది.

"అంత అవసరం?" అన్నాడు నీలకంఠం.

వేణుకు అలాంటి అవసరం లేదనే విషయం అతనికి పూర్తిగా తెలుసు.

కలవారిబిడ్డ కావటం ఒకటి. ఒక్కడే కొడుకు కావటం మరొకటి.

అయితే వేణుకు విద్య, విద్యకుమించిన వినయం, దాన్ని మించిన అణకువ, మంచితనం ఎన్నో ఉన్నాయి. అన్నీ కలిపితేనే వేణు. లేకుంటే విడివిడిగా చూస్తే అతను ఎవడూ కాదు. కనీసం వేణుకూడా కాదు.

"అవును నీలకంఠం! నీకు చెప్పకూడనిది ఏముంది నాకు చెప్పు? ఊరికినే కూర్చుంటే ఇంటివద్ద ఏం తోస్తుంది?"

"పుస్తకాలు..."

"ఎంతకాలమని!"

"అదీ నిజమే."

ఇంతకాలం పుస్తకాల పోరాటంలో కాకలుతీరిన బంటులా నిలిచి, జయించి, వీరుడు అనిపించుకున్నాడు. కళింగ యుద్ధం తర్వాత బౌద్ధమతం స్వీకరించిన అశోకునిలా అలిసి పోయి విముఖత కలిగి పుస్తకాల పోరాటానికి దూరం కావా లని సన్యసించదలచాడు. తాను ఆ మాట పైకి గట్టిగా అనక పోయినా అంతరాంతరాల్లో దానితాలూకు ధ్వని తరంగాలు వినిపిస్తూనే ఉన్నాయి.

"ఏం ఉద్యోగం చేయాలని?" ప్రశ్నించాడు నీలకంఠం.

"ఇదీ అని నిర్ధారణలేదు. కోరుకుంటే కోటి ఉద్యోగాలు దొరుకుతాయి—నాకున్న డిగ్రీలకు, డబ్బుకు, పరపతికి. కానీ వాటిని వేటినీ ఉద్యోగంకోసం వెచ్చించకుండా సొసైటీకి దూరంగా బ్రతికే ఉద్యోగం కావాలి. అదీ నా కోర్కె."

"ఏం? భారతీయ వేదాంతం వల్లెవేయ దలచుకున్నావా లేక మతం ఏదైనా స్థాపించదలుచుకున్నావా చెప్పు..."

మరో నవ్వు నవ్వనట్లుగానే నవ్వాడు.

"నీలాంటివాడు మతం స్థాపించినా, సన్యాసం పుచ్చుకునేందుకు అందగత్తెలే వస్తారు—సుజాత, ఆమ్రపాలి..."

"ఎప్పుడూ ఆ గొడవేనా, నాయనా నీకు?"

"లేకపోతే నీ కొచ్చిన చిక్కేమిటో చెప్పు. నాకు తెలీక అడుగుతాను..."

"అలా కూపీలాగకు మరి. ఏవో గాథల్ని మరిచిపోదామని నా తాపత్రయం. నువ్వు వాటినే పట్టుకు కూర్చుంటే నేనేం చేసేది? అసలు నా స్వంతవిషయాలు ఏమీ అడగను అని ప్రమాణంచేసిచెప్పు. లేకుంటే నిన్ను నాగదికి రానీయను. నీతో మాట్లాడను. సరేనా!"

"అలాగే అడగనులే" అని ప్రమాణం చేశాడు నీలకంఠం—దానివల్ల వచ్చేది, పోయేదీ అట్టే ఏమీ ఉండదు కనక.

ఒక వారం రోజుల్లో జంట నగరాలలో చూడవలసిన ప్రదేశాలన్నీ తిప్పాడు నీలకంఠం.

ఒకరోజు చార్‌మినార్ ఎక్కించాడు. అక్కడినుండి నగరాన్ని చూచి, కళ్ళు తిరిగిపోయేంత పని చేశాడు వేణు—పైత్యంచేసి కాదు, కళ్ళు తిరిగి కాదు—అక్కడనుండి నగర సౌందర్యాన్ని తిలకించగా కళ్ళు చెమర్చి.

మరొక రోజు గోల్కొండ తీసుకువెళ్ళాడు. అక్కడ తానీషా, రామదాసు మందిరాలు. జైలు పెద్ద అఖాతంలా, లోతుగా ఉన్నది. ఆ గోయి చూస్తూంటే కళ్ళు చెమర్చినయ్. విలువైన హోటళ్ళు అన్నీ తిరిగారు. శిల్ప కేంద్రాలు, కళా కేంద్రాలు, పబ్లిక్ గార్డెన్స్... అన్నీ పూర్తయినాయి.

అసలు హైదరాబాదు, సికిందరాబాదు వాతావరణమే వింతగా ఉంటుంది. ఎంతో ఆనందంగానూ ఉంటుంది. అనుకోకుండా పది నిమిషాలు జల్లులు పడటం, వాతావరణం చల్లబడటం.

దూరదూరంగా విసిరేసినట్లున్న ఇళ్ళు, పేటలు ప్రాచీన సంస్కృతికి, నాగరికతకు దర్పణంగా ఉన్నాయి. అక్కడ రోజు రోజుకు కొత్త సోయగాలు కనిపిస్తున్నాయి. వింత చెలువం వెలారుస్తూంది. ఇలా హాయిగా కాలం గడపవీలున్నది గనకనే నాటి రాజులు స్వర్గసౌఖ్యాలు అనుభవించారు అనుకునేవాడు.

ఈమధ్య కాలంలోనే బంజారా హిల్స్ ప్రాంతంలో ఒక చిన్న బంగళా అద్దెకు దొరికింది. హోటలునుండి మకాం ఎత్తివేసి అందులో దిగాడు వేణు. తనతో నీలకంఠాన్ని కూడా అక్కడకు మార్పించాడు.

రోజూ పగలు, తీరిక వేళల్లో రాత్రిళ్ళు తిరగటం.

"బాల్ రూం డాన్సుకు వెడదామా!" అన్నాడు నీలకంఠం ఓరోజు.

అతనికి అవి అంటే మహాఇష్టం.

"ఒద్దురా నీలకంఠం" అన్నాడు వేణు.

"నీలో సనాతనత్వం ఇంత చదివినా చావలేదురా భాయి. కాలాన్నిబట్టి అభిరుచులు మార్చుకోవాలి సుమా" అని హెచ్చరించాడు వేలు చూపకుండా నే.

"ఇంతకూ సాలార్ జంగ్ మ్యూజియం ఎప్పుడు చూపిస్తావు! రేపు వెడదామా—ఆదివారమేగదా?" అని అడిగాడు వేణు.

"నాకు వేరే పనిఉంది. పోనీ పదిగంటలకు నిన్ను అక్కడ దిగబెట్టేస్తాను. చూస్తూఉండు. సాయంత్రం అయిదింటికి వచ్చి కలుసుకుంటాను."

"అంతసేపూ అక్కడేం చేయమంటావు?"

"ఓస్! అదా నీ భయం. ఆ టైం చాలుతుందా అని అసలు. సగం చూడగలిగితే ఆ టైంలో చాలు. ఒక బొమ్మ దగ్గర నిలబడిచూస్తూ మూర్ఛపోకు..."

అనుకున్న విధంగా మర్నాడు నీలకంఠం వేణును మ్యూజియం దగ్గర వదలి వెళ్ళిపోయాడు.

ఒక్కడే బిక్కు బిక్కు మంటూ టికెట్ కొనుక్కుని లోపలకు అడుగు బెట్టాడు.

అక్కడ ఉన్న వందలకొద్దీ పాలరాతి విగ్రహాలు, దంతపు విగ్రహాలు చూశాడు ఓ అరగంటసేపు. అక్కడినుండి కదల బుద్ధి కాలేదు. నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ ముందుకు నడిచాడు.

ఏవేవో నగలు, నగిషీలు అన్నీ వేల సంఖ్యలో ఉన్నట్లున్నాయి.

మరో శిల్పం దగ్గర నిలబడి చూస్తూ ఉన్నాడు. అర గంట ఆ 'స్నాన సుందరి'ని చూస్తూ నిలబడిపోయినాడు.

"ఇంకా ముందు. ముందు ఇంకా మంచి శిల్పాలున్నాయి. ఇక్కడే టైం అయిపోతూంది" అన్నదో ఆ కంఠం.

ఆ కోమల కంఠస్వరం...ఎవరిదీ? అది ఆ స్నానసుందరి, నుస్నాత పలక లేదుగదా? నిజంగా ఆ శిల్పానికి ప్రాణంవస్తే ఎంత బాగుండును! ఎవరూ చూడకుండా తీసుకువెళ్ళి ఆరాధించేవాడు. అర్ధాంగిని చేసుకునే వాడతను.

తన కోసమే ఆమె మాట్లాడింది. ఒక్కసారిగా హృదయం ఆనందంతో పులకించింది. కళ్ళు చెమ్మగిల్లాయి.

"ఇంతటి ఉత్తమ ఇల్లాలు దొరికితే జన్మ ధన్యం కదా" అనుకున్నాడు.

"ఏం పరవశం చెందిపోతున్నారా?" అన్న ధ్వని వెనకనుండి.

ఈసారి వెనుదిరిగి చూచాడు. అది తనను ఉద్దేశించేనని, అనిపించినపుడు సంకోచించింది మనస్సు.

తన ఏకాగ్రతకు, తన్మయతకు. పారవశ్యానికి తనే సిగ్గు వడ్డాడు. ఎవరన్నా వస్తే, తన స్థితి చూస్తే — చూడనే చూచారు. జరగకూడదు అని అనుకున్నది జరిగినప్పుడు కలిగే సిగ్గు, అభిమానం ఒక్కసారి వేణును ఆవరించాయి.

వెనుదిరిగిన వేణుకు శంపాలతాంగన ఎదురైంది. ఇంద్ర చాపంలా వయ్యారంగా వంగి, చంద్రవంకలా పెదాలు మెలి తిప్పి, వచ్చిదానిమ్మ గింజల్ని పేర్చింది. ఆమె చూపులో నీలి నీలాంబరపు సోయగము కలదు అన్నట్లే ఉంది. వెన్నెలకన్న తెల్లగా కోలగాఉన్న ఆమె మొహం......ఎంత అందంగా, ఆకర్షణగా ఉన్నది!

"ఎవరు ?" అనుకున్నాడు.

కళ్ళు ప్రశ్నించాయి. పెదాలు దాటిరాని మాటల్ని మూటగట్టి చూపులు విసిరివేశాయి. ఆ చూపులే తూపులుగా వెళ్ళి ఆ జవ్వనికి, జఘనసుందరికి ఎక్కడ తగిలాయో కానీ, క్షణం నిశ్చేష్టిత అయి, తమాయించుకొని కర్తవ్యంలో కాలూనింది.

మరి రెండడుగులు ముందుకువేసి—వెనుదిరిగి నూటిగా చూడకుండా "దీన్ని జపాన్‌లో ఇరవైవేలకు కొన్నారట నవాబుగారు. ఇలాంటిది ప్రపంచంలో మరెక్కడా లేదు" అన్నది భీతహరిణేక్షణ.

అంతవరకూ ఆ శిల్పంముఖం కేసి చూడనేలేదు వేణు. ఆమె భుజాల్ని, ఎత్తుల్ని, ఒంపుల్ని, మిట్టపల్లాల్ని, ధనుస్సు లాంటి నడుమును చూస్తున్నాడు—ఎవరీమె ? అనుకుంటూ.

కట్టు చూస్తే తెలుస్తూనే ఉంది మహమ్మదీయ కన్య అని. ఇంత అందంగా ఉంటారా అన్నదే అనుమానం. ఇందాకటి ఆ స్నానసుందరిస్థానే ఈమెను నిలబెడితే జనం క్యూలో నిలబడి చూడరూ?

మరి నాలుగు గదులు అలాగే ఆమె ముందు, తను వెనక.

స్వచ్ఛంగా తెలుగు మాట్లాడగల మహమ్మదీయ కన్య. ఆశ్చర్యంగానే ఉంది.

"నేను చూస్తాన్లెండి. మీకు చాలాశ్రమ ఇస్తున్నాను" అన్నాడు సిగ్గుపడుతూ.

అంతమాట అననే అంటే ఆమె దూరం అవుతుందన్న అనుమానం లేకపోలేదు.

"నా డ్యూటీ" అన్నది ఒయ్యారం ప్రదర్శిస్తూ.

"అలాగా!"

మరి కాదనలేదు.

అలా ఆమె తనతో టే ఉన్నది. అనుమానాలు ఎన్నో అడిగాడు. కొన్నింటికి ఆమెకు తెలియదు. "సౌందర్యం చూచి ఆనందించండి. విమర్శ ఎందుకు? పుట్టుపూర్వోత్తరాలతో పనేమిటి? బురదలో పుట్టితేనేం—తామరపువ్వుకు అందం లేదా, విలువలేదా?" అన్నది.

అంటే 'నేను హిందూకన్యను కాని ఎందుకు, మహమ్మదీయనైతే నేం...నాలో ఏం లోపం? అందంలేదా? ఆకర్షణ

లేదా? పుట్టుపూర్వోత్తరాలతో ఏనేమిటి? అనేనా భావన'
అని తర్కించుకున్నాడు.

కొన్ని గంటలు ఆమెతో గడిపాడు—ఆమె గైడ్‌గా తను అనుసరించాడు. చెప్పినవన్నీ విన్నాడు. తలూపాడు. 'సఖ్యం సాప్తపదీనం' అన్నారు. మరి ఎన్ని వేల అడుగులో వేశాడు ఆమెతోడుగా, తోడు రాగా, నీడగా.

సాయంకాలం సమీపిస్తోంది.

"అన్నీ చూడలేదు" అన్నాడు.

"చూచినవన్నీ మాత్రం సరిగా చూచారా అని" అన్నది.

"చూడనిస్తేగా ?" నవ్వాడు

"ఊ." కొంటెగా. అంతకంటె బింకంగా చూపు సారించింది.

"మీ పేరు తెలుసుకోవచ్చా ?" అడిగాడు.

"అవసరమా ?"

"కాదు అనుకోండి అయినా..."

"సలీమా... రేపొస్తారుగా ? ఇంకా చూడాలిగా ?"

"రమ్మంటారా ?"

"అవసరం ఉంటేనే సుమండి!" నవ్వింది.

వేణు శ్రుతి కలిపాడు.

"నమస్తే" అన్నది.

వదలలేక కదలలేక ఆ ప్రాంగణం వదిలి బయట అడుగు పెట్టాడు భారంగా, భావాలు వెనుతిరిగి చూస్తూఉండగా.

* * * *

కామినీ విలాస చంద్రికలలో తప్తమైన హృదయంతో బంగాళాకు చేరుకున్న వేణుకు స్వాగతం చెప్పాడు నీలకంఠం.

"ఇయిదింటికి అక్కడ నిన్ను కలుసుకోలేకపోయాను మిత్రమా!" అని క్షమాపణ చెప్పుకున్నాడు. అతను రాలేదన్న దుగ్ధ వేణుకు లేదు. అసలు ఆతలంపే రాలేదు. అతని కోసం చకోరిలా ఎదురు చూడనూ లేదు. సలీమా పసిడి పలుకులు, కాంతులు హృదయాన్ని మోహించి వేస్తున్నాయి.

ఆ అమ్మాయి ఎవరు ?

ఎంత అందంగా ఉన్నది ?

ఆమె ఆంతర్యం ఏమిటి ?

అన్నవే ముసురుకుంటున్న జీమూతాలు.

సోఫాలో దిగాలువడి కూర్చుని, ఆలోచనలలో మునిగిపోయిన వేణును పలకరించాడు——

"ఏమిటి వేణూ ? అలా బెల్లం కొట్టిన రాయిలా ఉండిపోయావ్ ? ఏమిటా ముసిరే ఆలోచనలు —— కొంచెం తోల రాదా ?"

"అబ్బే. ఏం లేదు !"

లేదన్నంత మాత్రాన లేకుండా పోయిందా ? పోదు. ఆ విషయం నీలకంఠానికి తెలియకనా ! కాదు. ఇయితే సొంత విషయాల్లో తలదూర్చనని ఒట్టువేసుకున్నాడాయె ! అందుకే ప్రశ్నను బంధించి వేశాడు.

"ఈ వేళ మా నాటకం రిహార్సల్ ప్రారంభిస్తున్నాం. వస్తావా ?" అడిగాడు.

"ఊఁ."

"రేపు వరిషత్తుకు నాటకం ఆడాలని అనుకున్నాం. ఈ రోజే రిహార్సల్స్ ప్రారంభం. నీ చేతిమీదుగా కొబ్బరికాయ కొట్టి హారతి పట్టు. అదృష్టం వరిస్తుంది."

"రమ్మంటావా?"

"ప్రార్థిస్తున్నాను."

ఏకాంతంగా కూర్చుని సలీమాను కలగంటూ ఉండాలని అనిపిస్తున్నా, మిత్రునికి అనుమానం కలక్కుండా ఉండాలని బయలుదేరాడు.

త్రోవలో హోటల్లో రెండు వేడి వేడి కాఫీలు త్రాగి, పాన్ బనాయించి, సిగరెట్టు పెట్టె కొని, చెరొకటీ వెలిగించి నడక సాగించారు.

"దగ్గరే. నడుద్దాం. కొంచెం కాలు సారించినట్టు ఉంటుంది. కనులవందువగానూ ఉంటుంది" నీలకంఠం అన్నాడు.

అతనికి, అతనికే కాదు, చాలామందికి దీపాలుపెట్టే వేళ, నగరాల్లో నడవటం అంటే సరదా. షాపింగుకోసం వచ్చే అమ్మాయిలూ, సీతాకోక చిలుకలూ తారసపడతారు. కనుల వందువుగా ఉంటుంది.

నడుస్తూ నడుస్తూ ఉపోద్ఘాతంగా అన్నాడు:

"ఈసారి నాటకంలో మా అదృష్టాలు వెలుగులోకి రావాలి. ఈ నాటకం వ్రాసింది నేనే ననుకో. ఉత్తమ రచనకు బహుమతి అందితే—అదృష్టం తన్నిందన్నమాటే. ఎగిరి

సినిమాల్లో వాలాలి. ఎవరు చూసివచ్చారు—ఎవరి అదృష్టం ఎక్కడ, ఎప్పుడు మొదలవుతుందో...

"నాకన్నా ముఖ్యం మరోవిషయముంది. మా నాటకం లో నేటి అమ్మాయి వేషం వేస్తుంది. చాలా చక్కగా నటిస్తుంది. ఆమెకు ఏదైనా మంచి అవకాశం లభిస్తే చాలు. అసలు అందుకే నా ప్రయత్నం అంతా."

"అంటే?"

"అంటే ఏముంది? ఒకసారి పరిషత్తులో బహుమతి పొందిందీ అంటే సినిమా ప్రొడ్యూసర్ల దృష్టి పడుతుంది. ఆడదికదా, అదృష్టం వెదుక్కుంటూ వస్తుంది. మగవాళ్ళ కైతే కష్టంకానీ..."

"ఎవరా అమ్మాయి? ఏమా కథ?"

"ఎవరో నాకూ తెలియదు. ఆశ్రయించింది. ఆదరించాను. అంతే. ప్రతిభ ఉన్నది. ప్రోత్సహిస్తే రాణిస్తుందని నా ఆశ, పైకి వస్తే నాపట కృతజ్ఞతగా ఉంటుంది. ఏదో ఆడ పిల్ల కదా మరి..."

నీలకంఠం ఉపన్యాసం ఆగింది గమ్యంచేరడంతో.

ప్రారంభోత్సవం ఉత్సాహంగానే జరిగింది. నళిని హారతి పాడింది. నళినిని నీలకంఠం వేణుకు పరిచయం చేశాడు.

"ఈ అమ్మాయి నళిని. చక్కని నటి. కమ్మగా పాడుతుంది. అంతకన్నా ఏం చెప్పను? రూపం చూస్తూనే ఉన్నావుగా" అన్నాడు.

"మా వాడు ప్రవరాఖ్యుడులే ... ఏ వరూధినీ అతనికి తారసపడలేదింకా." అన్నాడు.

తన తెలివికి తనే నవ్వుకుని "అవునా" అన్నట్లు చూచాడు వేణు వైపు.

ఆహ్వానం అందుకోక తప్పలేదు.

ఇద్దరు అబ్బాయిలు, అమ్మాయి, చీకటి వీధుల్లో బజారు దీపాలు సృష్టించే వెలుగు మడుగుల్ని దాటుతూ, బంజారా హిల్స్ కేసి నడవక తప్పలేదు.

"మీరు అట్లా నడుస్తూ ఉండండి. నేను హొటలు దాకా వెళ్ళి కారియర్లు పంపమని చెప్పేసి వస్తాను" అని జారుకున్నాడు నీలకంఠం.

నళిని ప్రక్కనే వేణుకు నడవటం కొంత ఇరుగ్గానే ఉన్నది. ఏం మాట్లాడాలో తోచలేదు. అలవాటులేని నడక అది. దాదాపు ఏమీ మాట్లాడుకోలేదనే చెప్పాలి. పోట్లాడుకున్న దంపతుల్లా మూతులు బిగించి, అంతంత దూరంలో నడుస్తున్నారు బంగళా వచ్చేవరకు. లోపల దీపాలు వెలిగినయ్.

వేణుకు ఆరాటం హెచ్చింది. మనస్సు తబ్బిబ్బైంది. మాటలు రావటంలేదు. అయినా తమాయించుకున్నాడు.

"ఏదో సాధించాలని తాపత్రయపడి, ఏమీ సాధించలేక నిరాశపడటం ఈ కాలంలో అలవాటైపోయింది. పొందాలని అనుకున్న దాన్ని పొందలేకపోవటం, ఆ పొందుకోసం ఆరాటపడటం, చివరికి విరక్తి చెందటం కూడా సామాన్యమైపోయింది నళినీ" అన్నాడు.

వయ్యారంగా వంగి, చూపుడు వేలు బుగ్గన చేర్చి, మీనాల లాంటి కళ్ళు చలాకీగా త్రిప్పుతూ—

"ఎందుకనో?" అన్నది నళిని.

హృదయాలు దగ్గర అయినకొద్దీ వారిద్దరూ దగ్గరవుతూ అలా షికారులనీ, కబుర్లనీ అనుభవిస్తూనే ఉన్నారు.

"ఏమో? నాకు అలా అని అనిపిస్తూంది. ఒకరిని ప్రేమించటం, ఆ వ్యక్తే తనకు కావాలని గుండెల్ని ఉగ్గపట్టు కోవటం అనవసరం" అన్నాడు.

అప్పుడే కళ్ళు ఆర్ద్రాలైనట్లు, అటు తిరిగి ముఖంపై పడ్డ వెలుగు సాక్ష్యం ఇచ్చింది.

"అలాంటిది మీకు జరిగిందా?" అన్నది.

"ఆఁ! అందం అంటే ఎలాంటిదో ఎరగనివాణ్ణి. అంటే తెలియదని కాదు. అందాన్ని దగ్గరగా అనుభవించలేదు. చాలా నిష్ఠగా బ్రతికాను. కఠోర బ్రహ్మచర్యాన్నే వరించాను. ఎందుకు...?"

"ఒక అమ్మాయిని ప్రేమించి? అవునా?"

"ఆఁ! ఈ సంవత్సరంలో పెళ్ళి కావలసింది. నా రాధ నాకు కాకుండా పోతుందని అనుకోలేదు."

"ఎవరా రాధ?"

"బంధువుల అమ్మాయే. ఆ అమ్మాయినే నాకిచ్చి చేయాలని అమ్మ నాన్న ఉబలాటపడ్డారు. నేనూ నిజం అనుకున్నాను. చదువు పూర్తి కాగానే పెళ్ళిచేసుకుందాం అనుకున్నాను."

"మరి చేసుకోలేదా ?" అడిగింది.

"లేదు. నాకీమధ్యవరకు ఆ విషయం తెలిసింది కాదు. ఆమె ఎవరినో ప్రేమించిందట. సంవత్సరం క్రితమే ఆ ప్రియునితో పెళ్ళిపోయిందట. ఆ విషయం తెలిస్తే నా చదువు పాడవు తుందని నాకు తెలియనివ్వలేదు ఇప్పటివరకూ."

వేణు హృదయంలో పొంగిన సముద్రాలు, విరిగిన కెరటాలు లెక్కబెట్టడం నళినికి చేతవును.

"అంతేగదా...ఆ అమ్మాయిని అంత ఇదిగా ప్రేమించారా ?" అన్నది.

"ఆ!"

"ఆమె కనిపిస్తే ఏం చేస్తారు ?"

"అసంభవం. ఎలా కనిపిస్తుంది ? ఏ నందన వనాల్లోనో ఉంటుంది. నన్ను జ్ఞాపకం పెట్టుకోవలసిన పని ఏముంది ? ఇష్టమైనవాణ్ణి చేసుకుంది."

"కావచ్చు. కాని, ఏ పరిస్థితుల్లో నయినా ఆమె మీ దగ్గరకు వస్తే మీరు క్షమిస్తారా ? ఆమెను మీరు పెళ్లి చేసుకోగలరా !"

"పెళ్ళేమిటి నళినీ, పువ్వుల్లో పెట్టి పూజిస్తాను. అసలు అందుకేగా బ్రతికి ఉంది" అన్నాడు.

"పోనీయండి. ఆ అదృష్టం ఆ అమ్మాయికి ఉంటే ఒక నాటికి మీ దగ్గరకు వస్తుంది. ప్రేమ నిషా ఎంత కాలం ఉంటుంది చెప్పండి ? అన్ని నిషాల వంటిదే అదన్నీ."

రోజులు గడుస్తున్న కొద్దీ వేణుకు నళినిపైన మక్కువ ఎక్కువవుతూ వస్తోంది. ఆమెను చూడకపోతే ఏదో పిచ్చెక్కినట్లు ఉండేది. రోజూ రిహార్సల్‌కి వెళ్ళి చూసేవాడు. తన వెంట త్రిప్పుకునే వాడు. సినిమాలకు తీసుకువెళ్ళేవాడు. తనలో పోగొట్టుకున్న అదృష్టాన్ని వెదుక్కున్నాడు. అది అక్కడ లభించింది.

ఒక రోజు వేణు నీలకంఠాన్ని అడిగాడు తాపీగా సిగరెట్ పొగ వదిలి —

"నీలకంఠం! నేను నళినిని వివాహం చేసుకుంటే నీకేం అభ్యంతరం లేదు కదా" అని.

ఆ మాట పిడుగుపాటుగా సోకినా చలించకుండానే—

"ఏం? ఆమె బాగుపట్టం నీకిష్టం లేదా?" అన్నాడు.

అంతమాట అనాలనే అన్నాడు నీలకంఠం. మిత్రుణ్ణి బాధించటం అభీష్టం కాదు. కానీ అతన్ని గాఢంగా, మత్తులో ఉంచడానికి మరో గ్లాసు నిషా అవసరం అని అతనూ గ్రహించాడు.

"నళిని పెద్ద స్టారై సినిమాకాశంలో వెలిగిపోవాలని నేను ఆశిస్తూంటే, పెళ్ళి చేసుకుని ఆ అవకాశాన్ని త్రుంచి వేస్తానంటావేం?"

"సరేలే పోనీ నీలకంఠం, నాకా అదృష్టం లేదన్నది మరోసారి నిరూపించుకున్నాను. చాలు."

"అహా! అహా! అలా అని నిరుత్సాహ పడకు సూరి. అసలు ఆ అమ్మాయి చరిత్ర తెలిస్తే నీవు ఈ అభిప్రాయానికి రావేమోనని నా భయం."

"చరిత్రతో నాకేం పని? అవును, చరిత్రహీనులు, పవిత్రులు, ఉన్నతులు అనే విషయం సాహిత్య సత్యం. ఎన్ని పుస్తకాల్లో అలాంటి వ్యక్తులు మనకు తారసపడలేదు. చెప్పు."

"నేను చెప్పేది జీవితం విషయం."

"జీవితమే సాహిత్యం విలువలేని జీవితాలే, విలువ కట్టలేని సాహిత్యపు వెలుగులుగా మారి కూర్చుంటాయి."

"అయినా నాకెందుకు? నీ వ్యక్తిగత విషయాల్లో జోక్యం కలిగించుకోనని హామీనిచ్చాను. నీ ఇష్టం. నళినినే కదిపిచూడు. ఆమె అంగీకరిస్తే నాకేం? నేనేం మెడకు కట్టుకున్నానా?"

"అదా సలహా..."

అతను చెప్పినసలహా లేదు కానీ, ఆ సాయంత్రం నీలకంఠం ఇంటలేని వేళ నళిని ఇంటికి రావటం వేణు హృదయారాటాన్ని వ్యక్తం చేయడానికి అవకాశం ఇచ్చింది. అందుకే అన్నాడు అవకాశంతీసుకొని—

"నళినీ, నాకో చిన్న సహాయం చేసిపెట్టగలవా?" అని

"అవసరమైతే" అన్నది. ఆమెకు తెలుసు ఆయన అడగబోయే నాటిరూపం ఎలాంటిదో. ఆ రోజు ఒకసారి వస్తుందని ఏనాడో గ్రహించింకూడా.

"నన్ను ప్రేమించగలవా?" అడిగాడు తలవంచుకుని.

"ఎప్పుడో ప్రేమించాను" అన్నది సూటిగా.

ఆ సమాధానానికి ఉక్కిరి బిక్కిరి అయిపోయినాడు. ఆనందం ఆర్ణవమే అయింది.

"నిజంగానా?" అన్నాడు. కళ్లు చెమ్మగిల్లాయి.

"ఆఁ! కానీ, పెళ్లి చేసుకోలేను" అన్నది.

"అదేమిటి నళినీ?"

"అవును వేణూ? ప్రేమించిన వ్యక్తిని పెళ్ళిచేసుకోలేను. పెళ్ళిచేసుకున్న వ్యక్తిని ప్రేమించలేను. అది నాలోని బలహీనత" అన్నది.

ఆ అనడంలో ఆమెకళ్ళు ఎర్రబడి, తెల్లటి అశ్రువుల్ని రాల్చాయి.

"అంటే నన్ను పరీక్ష చేస్తున్నావా?" అడిగాడు.

"లేదు వేణూ...నా జీవిత పరీక్షలో నేనే నిలబడి ఓడిపోతూ ఉన్నాను. ఓడిపోవటమే నేను చేయగలిగింది. గెలవటం అన్నది ఈ జీవితంలో లేదు."

"అభ్యంతరం ఏమిటి?"

"అభ్యంతరం ఒక్కటే. పెళ్ళి చేసుకోవాల్సిన వ్యక్తిని ప్రేమించలేక పోయాను. ప్రేమించిన వ్యక్తిని పెళ్ళిచేసుకోలేక పోయాను. శాశ్వతంగా పొందలేకపోయాను. చివరకు తెలుసుకున్నాను—పెళ్లి చేసుకుంటే బాగుండేదని. హృదయం బలహీనమైంది. అందుకే ఇతరుల హృదయబలం తెలుసుకోలేక పోయాను."

"సూత్రాలు వల్లిస్తున్నావా నళినీ?"

"లేను. నా జీవితాన్నే సూత్రీకరించాను. అనుభవాన్ని త్రాటిమీద నిలబెట్టాను. పరుగుపందెంలో ఓడిపోయాను."

"మరి ఈ నిఘా ఏమిటి?"

"అదే విచిత్రం వేణూ! నేను 'నేను' అని తెలిస్తే!"

"తెలిస్తే? తెలిసేకదా నీవు కావాలనుకుంటూంది?" గట్టిగానే అన్నాడు వేణు. ఆమె చలించింది.

"అయితే నా నిర్ణయం మీకు రేపు ఉదయం లోగా తెలియజేస్తాను. సరేనా?" అన్నది.

"శిరోధార్యం" అన్నాడు వేణు ఆనందంగా.

నళిని లేచింది.

"వస్తా వేణూ..." అని వెళ్ళిపోయింది.

"నళిని ఎంత అందమైంది! ఎంత తెలివి గలది! ఎంత చక్కగా పాడుతుంది!" అనుకుంటూ కాలక్షేపం చేశాడు.

అంతలో నీలకంఠం రానే వచ్చాడు.

"నళిని ఒప్పుకుందిరా నీలకంఠం" అన్నాడు సంతోషంతో.

"అసంభవం."

"కాదు, నిజం."

"అయితే ఆ నిజం నిజం కాదు."

"ఏ నిజం?"

"నువ్వు సాలార్ జంగ్ మ్యూజియంలో ఓ అమ్మాయిని చూచావనీ, ఆమెను ప్రేమించావనీ చెప్పింది నాతో!" అన్నాడు ఓరగా చూస్తూ.

"లేదు. మళ్ళీ కనిపించిందా?"

"చచ్చాం పో. ఆ సలీమాను పెళ్లాడతావా?"

"ఏం నళిని కాదన్నదా?"

"అనలేదు. కానీ మక్కువ కలిగితే..."

"ఏమో!"

"పోనీ ఆ సలీమాయే నళిని అంటే నమ్ముతావా?"

"ఆ! నిజం?" అన్నాడు ఆశ్చర్యం అనే స్పుత్నిక్‌లో ఆకాశంలోకి ఎగిరి.

"అంతేకాదు వేణూ ... సలీమాగా, నళినిగా ఉన్న ఈ అమ్మాయి అసలు పేరు రాధ. ఆమె ప్రేమించిన వ్యక్తి మోసంచేసి పారిపోతే ఈ నీలకంఠం గార్డియన్ అయినాడు. సరేనా?"

"ఆఁ! ఈమె రాధా?"

"అవును."

* * * *

ఆ రాత్రి అంతా నళిని ఆలోచించింది. రకరకాల ఊహాలు ఆమె మదిలో మెరిసినయ్. జీవితం చుక్కానిలేని

నావలా కావటం ఇష్టం లేదు. అందుకే ఒక ఇంటి పట్టున అర్ధాంగిగా ఉండాలని నిర్ణయించుకుంది. మనసు పడ్డ వేణుకే అంకితం అయిపోవాలని నిర్ణయించుకుంది.

నిర్ణయాన్ని తెలియజేయాలని పొద్దున్నే బయల్దేరింది వేణు ఉంటున్న బంగాళాకు. అల్లంత దూరంలో ఉండగా, ఆ బంగళాముందు నుండి ఓ కారు బయల్దేరి సికింద్రాబాదు స్టేషన్ వైపు పరుగు తీసింది. వెనక అద్దంలో నుండి వేణు తల స్పష్టంగా కనుపించింది.

రెండడుగులు ముందుకు వేసి, పమిటకొంగు నోటి కడ్డం పెట్టుకుని, కన్నీటికి కరకట్టలు వేసుకుంటూ వెనుతిరిగింది. ఆమె కన్నీటికి విలువ, బరువు ఉందని తెలుసుకున్నవాళ్ళు అక్కడెవరూ లేరు పాపం!





## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA114B104 |
| పుస్తకం పేరు | పు న ర పి జ న నం |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 179 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 4 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | P. Jayamma |
| పేజీలు విడదీసినది | P. Jayamma |
| స్కాన్ చేసినది | AD10998 |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | NO |
| పరిస్థితి | good |